

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# జీవన్ముక్తి బోధామృతము

## ప్రారంభము.

---

శ్లో॥ గురుర్బ్రహ్మగురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ । తస్మైశ్రీగురవేనమః ॥

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకునిచే నిర్మింపఁబడిన యీ సమస్త జీవజంతువులలో మనుష్యజన్మ ముత్తమము. అట్టుత్తమ దేహధారియైన మనుష్యునకు ధర్మార్థకామ మోక్షములను చతుర్విధ పురుషార్థములలో పరమపురుషార్థంబగు మోక్షమును జెందగోరువారలకు సాధనచతుష్టయ సంపత్తియే ముఖ్యావశ్యకము. కాబట్టి సాధనచతుష్టయసంపత్తి యనగా

(1) వివేకము (2) వైరాగ్యము (3) షట్సంపత్తి (4) మోక్షేచ్ఛ అను యీ సాధనసంపత్తి గలవారే యీ గ్రంథమునుపఠింప నధికారులని చెప్పనైనది. ఆత్మయే నిత్యమనియు నామరూపాత్మకమైన యీప్రపంచ మనిత్యమనియు భావించినచో వివేకము ఇహాపరభోగములను గోరకుండుటయే వైరాగ్యము. (శమము) అనగా సర్వవాసనాపరిత్యాగము (దమము) అనగా బహిరింద్రియ నిగ్రహము (ఉపరతి) అనగా ప్రపంచ నివృత్తి (తితిక్ష) అనగా శీతోష్ణాది ద్వంద్వరహితము (శ్రద్ధ) అనగా



వైశ్యరత్నంబగు

శ్రీయుత

చెర్విరాలబాగయ్యగారు

బ్రహ్మనిష్ఠ, ఆచార్యసేవ, వేదాంత వాక్యములయందు విశ్వాసము
(సమాధానము) అనగా పెద్దలగువారు వేదాంతోపదేశము జేయుకాల
మున చిత్తము చలించకుండుట యిదియే షట్సంపత్తి యనంబడును.
సంసార బంధమునుండి విడుదలగాదలంచుటయే మోక్షేచ్ఛ, అను యీ
సాధనసంపత్తిగలవారే మోక్షమున కధికారులు. ఇక నీప్రపంచమందలి
మోక్షవిచారకుల కొందరిని చర్చించిచూచెదము.

చ॥ బుధులమటంచుకుత్సితము ♦ బూనిజగంబుననుండువారలన్
వెదకియుగోప్యమైనసువి ♦ వేకముదెల్పెదమంచుజాటుచున్
మదవతులన్వశీకరణ ♦ మంత్రముచేతనుమోసబుచ్చుచున్
మదనునికేళిగూడెడుకు ♦ మానసులెందరోనుండిరీభువిన్॥

చ॥ గురువులమంచుజెప్పుకొని ♦ కూడుధనంబులనాశచేత నీ
ధరచరియించుచున్ప్రజల ♦ ధర్మముపాడొనరింపబూని దు
ష్కరమగుబోధచేపలల ♦ ఖండములన్మధుమత్స్యసేవలన్
దరయగద్రోయుచుండిరిక ♦ తథ్యముసుమ్మిదిగాంచుడోజనుల్॥

మ॥ శిలలంకొందరుపూజజేయుటమహా ♦ శ్రేయస్కరంబంచు బో
ధలచేబూటకశాస్త్రయుక్తులచెమో। దంబుంకడుంజేసి వా
రలద్రవ్యంబునుకొల్లబెట్టియుదురా ♦ చారంబునంద్రోసి ధీ
రులరైయుందురుదుష్టమానవులుఛీ। రోయుండియాక్రూరులన్॥

అనునటుల ప్రపంచములో కొందరు విషయలోలురు తెలివి
లేమి మోక్షమన తమ విషయసుఖములలో నొకటనిభావించి దుష్కర్మ
లాచరించుచు నరకకూపమున బడుచుండిరేగాని నిజముగా మోక్షసాధన
మెద్దియో దెలియకుండిరి. యీవిషయమై సామాన్యులట్లుండ, కొందరు
గురువులమని పేరుబెట్టుకొని జనులను మోసగించుటకు నేవో కొన్ని
యుక్తులుబన్ని భూతపూజలు సలుపుచు భుక్తిదీర్చు మనస్సుగలవారై
శక్తిపూజ లెన్నియోగల్పించి పొట్టపోషణముగూర్చి పరమగురువులమని
జెప్పుచు రూకలకై మంత్రములమ్ముచునర పిశాచములనబరగి శిష్యుల
ద్రవ్యము లాగుచుండిరేకాని, మోక్షమునకు తగిన సాధనచతుష్టయ
ములను బోధించి తద్ద్వారా శిష్యుల మోక్షమున కందింపజాలకుండిరి.

ఇంతటి తెలివి వారికెట్లుగలుగును శిష్యుల సందేహమును నివారణజేసి సాధనసంపన్నులను జేయవలయునన్న మొదటతాను సాధనసంపత్తి సముద్రిడైకావలె నట్టి తెలివియున్న అసలేసున్న, శూన్యమైన తెలవి గల దొంగవేదాంతులీ ప్రపంచములో నెక్కడజూచిన గుంపులుగుంపులుగా గలరుగాని, జ్ఞానసాధనచతుష్టయ సంపన్నులు దొరుకు టరుదు, దొరికిన జగత్స్వభావదోషముంబట్టి దక్కుటరుదు ఇక నీసంగతి నింతటితో విరమించి గ్రింధావలోకనము జేయుదము.

ఈగ్రంథవిషయమును దెలుపుచున్నాను, ఓమాత్మపరమాత్మ ఐక్యతనుగూర్చి అచ్చటచ్చట నిరూపింపబడినది. ఇక దీని సంబంధమేటెయో యీదిదెలుపుచున్నాను, ప్రిదిపాదన, ప్రతిపాద్యభావవ, ఈరెంటికే సంబంధముండునో ఆసంబంధమీ సాంఖ్యసూత్రముకున్న అద్వితీయ బ్రిహ్మకుండును, అనగా! యీగ్రింధము బ్రిహ్మముయొక్క ప్రితిపాదన జేయుచున్నది, మరియు నీగ్రంథప్రయోజనమేమన, సాంఖ్యసూత్రవిచారమువల్ల జనించుజ్ఞానముచే అజ్ఞానమునశించి శుద్ధజ్ఞానము లభించును, యీమూటి అనుబంధాస్థిత్వమిందులో నుండుటవల్ల నిది ముముక్షువుల కత్యంతోపయుక్తంబని చెప్పక తప్పదు.

ఆ॥ వె॥ ప్రిత్యగాత్మతాను బహునాళ్లనుండియు భ్రిమలోజిక్కొనియు పలువిధముల తనువునేనటంచు దలచుండెనుగాని తానే బ్రిహ్మమంచుగానకుండె.

ప్రిత్యగాత్మయనగా! మాయోపాధియగు జీవాత్మ, ఇట్టి జీవాత్ముడు చాలాకాలమునుండి భ్రిమలోదగుల్కొని దానివల్ల తనయొక్క దేహమే తానని దలంచుచుండెను. నిజము విచారించినచో జీవాత్ముడు సచ్చిదానంద స్వరూపుడేకాని దేహరూపుడుకాడు. ఇటులుండికూడా నేను దేహమును, నేనుమనుష్యుడను, నేను ద్విజుడను, నేను క్షత్రియుడను, అని యిటుల కేవలభ్రిమలో దగుల్కొనియుండెను. ఎటులన!

దృష్టాంతము॥ ఒకయూరిలో నొక బ్రాహ్మణుండొకనాడు మిక్కుటముగా భంగుద్రాగెను దానివల్లాతనికి పైకెక్కి తన బ్రాహ్మణత్వమును మరచి నేనుశూద్రుడను, నేను వైశ్యుడను, నేను క్షత్రియుడ

నని విపరీతముగా పలుకసాగెను: కాని అటులెన్నివిధముల బలికినప్పటి కిన్ని నిజముగా బ్రాహ్మణత్వముపోయి యుండెనా? లేదు. తాను బ్రాహ్మణుడౌట నిజమే, నింతలో నాతని స్నేహితుడొక డరుదెంచి యాబ్రాహ్మణుని మత్తుదొలగించుటకై నేయిని కొంత త్రాగించెను. దానివల్ల నాతని మత్తుదొలగిపోయి యటుపిమ్మట యాబ్రాహ్మణుడు నేను బ్రాహ్మణుండనని తెలివి దెచ్చుకొని యెవరెన్నివిధముల అడిగినను నేను బ్రాహ్మణుండననియే దృఢముగా బల్కుచుండెను. ఎంతవరకు మత్తుదొలగకుండెనో అంతవరకు అతనిబుద్ధి విపరీతమైయుండెను కాని; మత్తుదొలగిన పిమ్మట విపరీతబుద్ధియుండునా? యుండదు.

సిద్ధాంతము। అటులే, జీవాత్ముడు అజ్ఞానమను మత్తువల్ల మాయాకల్పితంబైన స్థూలసూక్ష్మ శరీరముల కల్పితసంబంధమువల్ల తన నిజమగు సచ్చిదానందస్వరూపమును మరచి, నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నేను వైశ్యుడను, నేను శూద్రుడను, నేను బ్రహ్మచారిని, నేను గృహస్థుడను, నేను వానప్రస్థుడను, నేను సన్యాసిని, నేను పురుషుడను, నేను స్త్రీని, నేనుబుట్టెదను, నేనుజచ్చెదను, ఇటుల విపరీతాధ్యాసము జేయుచుండును. నిజముగా తాను స్వయము దేహాదికములయొక్క ద్రష్ట, సాక్షి, యగు బ్రహ్మరూపుడేగాని అజ్ఞానమువల్ల దెలియకుండెను. ఎప్పుడైతె యిట్టి అజ్ఞానియగు జీవునకు బ్రహ్మనిష్ఠగల సద్గురుడు లభించునో అట్లు లభించిన పిమ్మట బ్రహ్మవిద్యోపదేశమను నేయిని ద్రాగించునో యప్పుడే యాతని అజ్ఞానరూపమగు మత్తుదొలగిపోవును. అటుపిమ్మటాతడు నేను దేహమును, నేను మనుష్యుడను, నేను కర్తను భోక్తనని యిటులెన్నటికిని నమ్మజాలడు. తిరుగనేను సచ్చిదానందస్వరూపమగు బ్రహ్మననియే నమ్మును కాని, యీసత్యమెంతవరకాతనికి దృఢనిశ్చయముగాదో యంతవరకు బహునాళ్ళనుండి పాదుకొనియున్న తెలివిహీనతవల్ల నేను దేహమనియే నమ్ముచుండును: ఎటులనగా

దృష్టాంతము। ఒక గొల్లవాడడవిలో తనగొఱ్ఱెలను గాయుచుండగా యాసమీపమందుండు పర్వతముకడకేగి అచ్చట నొక గుహయందొకపులికూన గాన్పించగా యాగొల్లవాడు దానినింటికి గొనివచ్చి

పోషించుచు ప్రతిదినమూ గొఱ్ఱెలయందే దాని నాడించుచుండెను.
ఇటులాపులికూన గొఱ్ఱెలవెంబడి దిరుగుచుండ కొన్నాళ్ళకది పెద్దదై
నప్పటికిని గొఱ్ఱెలలోనుండుటఁబట్టి తన స్వజాతినిమరచి నేనుకూడా
గొఱ్ఱనేయని అజ్ఞానమువల్ల దలంచుచుచుండెను. ఆగొల్లవాడుకూడా
దానినొక గొఱ్ఱవత్తుగానే చూచుచుండెను. ఇటుల కొన్నిదినంబులు
గడచిన పిమ్మట నిత్యము మేరకు యడవిలో గొఱ్ఱెలవెంబడి పులిపిల్ల
దిరుగుచుండగా నింతలో నొకపెద్దపులి యటకరుదెంచి యందున్న తన
జాతిబాంధవుడగు పులింజూచి ఆశ్చర్యపడి వెంటనే గొప్పగా గర్జించెను.
అది వినినతోడనే గొఱ్ఱెలన్నియు పారజొచ్చెను. వాటితో యాపులి
కూనగూడా పరుగిడుచుండ నదిగని, యాపెద్దపులి దానికెదురుగాబోయి
నడ్డగించి, ఒరే! నీవు నాయొక్క జ్ఞాతిబంధుడవై యీగొర్లమందలో
నెటులుంటివన, అందుల కాపులి భయపడి నాయనా! నేను పులినిగాను
గొఱ్ఱెను, నీవు పులివైననవుదువుగాక, నన్నువదిలివేసి నిందుకపుణ్యముఁ
గట్టుకొమ్మని పలికెను. అంతయా పులివిపరీతవాక్యములాపెద్దపులివిని తన
లో, నది సహవాసమువల్ల నిట్లుబల్కుచుండెననియెంచి దీనిభ్రాంతి నెటు
లైన దొలగింపవలెనని, ఒరే నాయనా! ని వివరో నిజముగా యోచించు
కొమ్ము, అదోచూడు మాగొఱ్ఱెలన్నియు నీకంటె చిన్నవిగానున్నవి నీవు
వాటికంటె పెద్దగానున్నావు కాబట్టి నీవు గొఱ్ఱవెట్లగుదువన, నది
అయ్యా! నేను గొఱ్ఱనే ఒకవేళ నేను గొఱ్ఱనైయుందునన, యామాటల
కాపెద్దపులి ఒరే! నీవు మరల విచారించుకొమ్ము లేదేని నావైపుంజూడు
ము నేను స్వయముగా పెద్దపులిని, ఇదో నాయొక్క లక్షణములు నీ
యొక్కలక్షణములు నొకటిగాగలయుచున్నవి, యాగొఱ్ఱెల లక్షణ
ములెంతయు నీలక్షణములతో బోలవు. నామాటలయందు విశ్వాసము
లేదేని అదోచూడుము గొఱ్ఱెలకాళ్ళయందు రెండుగాచీలినట్లుగా గిట్ట
లు గలవు. నీకు గోళ్లుగలవు అదిగాక, వాటితోక చిన్నదిగానుండి కద
లుచున్నది మనతోకలన్నచో పెద్దవిగానున్నవి. కాబట్టి నీవెంతమాత్రము
గొఱ్ఱవుకావు పులివేయన, ఆమాటలకా యజ్ఞానిపులికించుక భ్రాంతివల్ల
ముగలిగి, నాయనా! నీవనుమాట నిజమనిదోచుచుండెనుగాని, వ్ధబ్రహ్మవై

దృఢనిశ్చయముగాదయ్యె ననుటయు, అప్పుడా పెద్దపులి దానిందోడ్కొని చేరువనున్న తటాకమువద్దకరిగి దానినచ్చట నిలిపి తానుగూడా పక్కన నిలచి, అదో చూడుమానీటియందు మనయిరువురి ప్రతిబింబములొకే తీరుగానుండెనా లేదాయన, నది సర్వలక్షణములు చక్కగా పరిశీలించి తానుగూడా పులినని నిశ్చయించుకొని పశ్చాత్తాపము జెంది నేడు మొదలిక నెన్నటికిని గొఱ్ఱెల సహవాసముజేయక తిరుగా గొఱ్ఱెలనన్నిటిని నాశనంబొనర్తునని పంతమూని అది మొదలు పెద్దపులివెంట దిరుగుచుండెను.

సిద్ధాంతము॥ ఇటుల దేహముయొక్కద్రష్ట జీవాత్మయే నిజముగాని అనాదికాలమునుండి నేదైతె అజ్ఞానము స్వస్వరూపమునుమరచియుండెనో దానికనుసరించి అటులే కామ్యకర్మలయొక్క సంబంధమున నుద్భవించిన మాయాకల్పితంబైన దేహేంద్రియసముదాయములలో చిక్కొనిన జీవాత్ముడు గొఱ్ఱెల సహవాసంబున నెటులైతె పులి, నేను గొఱ్ఱెనని బలుకుచుండెనో అటులే యింద్రియసముదాయమే నేనని మిథ్యాభ్రాంతిచే జీవాత్ముడు బలుకుచుండెను. అనగా! నేను మనుష్యుండననియు, స్త్రీననియు, పురుషుడనని దలంచుచుండి తనయొక్క మూలస్వరూపవిలక్షణమును భ్రాంతిగామరచిపోయెను. ఎటులన! దృష్టాంతమందున్న గొల్లవానివలె నొకానొక బేధవాదిగురుండు తటసించిన నాతడు, నీవు సంసారివి దేహమువనియు, కర్తవనియు, భోక్తవనియు, ఇటులనేక విధంబుల బోధజేయుచు అతని యజ్ఞానమును మరింత దృఢపరచును. అంత నాగురుని సాంగత్యమువల్ల నిరువురి మతమొక్కటేయగుటవల్ల యీ అజ్ఞానియగు జీవాత్ముడు తనయొక్క నిజస్వరూపమును పూర్తిగామరచి నేను దేహమునియేగట్టిగానమ్మియుండును. ఒకవేళ యీయజ్ఞాని జీవాత్మునియొక్క సుదైవయోగంబున, పూర్వజన్మపుణ్యఫలంబున, ఒకానొక వేదాంతశాస్త్రము చక్కగా నభ్యసించినవాడును బ్రహ్మనిష్ఠాపరుండగు సద్గురుండాతనికి తటస్థించును. పిమ్మట యీసద్గురుడాతని లక్షణముగా యా[illegible]చి (దృష్టాంతమందెటులైతె పులిపిల్లను పెద్దపులి విచారించెదొకపులికూ) యాతని విచారించును ఎటులనగా

గురు॥ ఓయీ! నీవెవరు, నీవు పరబ్రహ్మస్వరూపమును గుర్తించి యున్నావా?

శిష్యు॥ అయ్యా! నేను మనుష్యుడనగుటచే పరబ్రహ్మస్వరూపము నెట్లు గుర్తింతును.

గురు॥ ఓరీ నాయనా! ఈ నీదేహమే మనుష్యుడుగాని, దేహమును గుర్తించు ఆత్మయను నది దేహముకంటె వేరుగానున్నది కాబట్టి నీవు మనుష్యుడవుగావు, నీవు బ్రహ్మవే, నేను బ్రహ్మ నెట్లు గుర్తించగలనని కేవల మజ్ఞానమువల్ల యనుచుంటివి.

శిష్యు॥ గురురాజా! మీరనునటుల నేను బ్రహ్మమెటులౌదును నేను మాత్రము సంసారిని, సుఖిని, దుఃఖిని, కర్తను, భోక్తనని నిక్కముగా దలచుచున్నాను నేనెట్లు బ్రహ్మమగుదును.

గురు॥ హేముముక్షో! నీవు చక్కగా విచారించి చూడుము. నీదేహమందేదైతే అహంకారముగలదో యదే సంసారి, సుఖి, దుఃఖి, కర్త, భోక్త, మొదలగునదై దృశ్యముగానున్నది నీవు దానియొక్క ద్రష్టవై యున్నావు. నీదేహలక్షణంబొకటిగూడా నీయాత్మలక్షణములతో బోల్చదు, (ఎటులైతే గొఱ్ఱెలక్షణములు పులిలక్షణముతో బోలవో అటులే) బ్రహ్మసత్యమైనది. అప్రకారముగా నీవుగూడా జాగ్రదాది మూడవస్థలయందు సత్యముగా నున్నాడవు. బ్రహ్మమెటులైతే జ్ఞానరూపమో యటులే నీవుగూడా అవస్థాత్రయము నెరుగుచుందువు. జ్ఞానరూపబ్రహ్మ మెటులైతే యానందరూపమైయున్నదో యటులే నీవు పరమ,ప్రేమాస్పదుడవై యున్నావు. నీవును బ్రహ్మవలె పుట్టుట పెరుగుట మొదలగు షడ్వికారరహితుడవై యున్నావు. నీయొక్క దృశ్యదేహము అసత్యమై జడమై దుఃఖరూపమగు షడ్వికారయుక్తంబై యున్నది నిజము విచారించిన దేహముతో నీకెంతమాత్రము సంబంధము లేదు. కేవల నీనిజస్వరూపముయొక్క అజ్ఞానమువల్ల, సుఖదుఃఖ కర్తృత్వభోక్తృత్వములు మొదలగునవి, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారముల. అంతఃకరణ చతుష్టయధర్మము, అదినీవు భ్రాంతివల్ల ఆత్మధర్మంబని యెంచుచుంటివి. వాస్తవముగాజూచిన నీవు శుద్ధబ్రహ్మవై

యున్నావు. నీయందు సంసారములేదు యిందుకు, శ్రీమద్భాగవతమునందు భగవంతుడుద్ధవునకిట్లు బోధించియున్నాడు.

శ్లో॥ శోకహర్షభయక్రోధ । లోభమోహస్పృహాదయః
అహంకారస్యదృశ్యంతే । జన్మమృత్యుశ్చనాత్మనః॥

సంతోషము, దుఃఖము, భయము, లోభము, మోహము, ఇచ్ఛా, జన్మము, మృత్యువు, మొదలగు శబ్దములచే వ్యక్తమగు కర్తృత్వభోక్తృత్వాది సకల ధర్మములు అహంకారముచోట నగుపడునేగాని, ఆత్మయొక్కచోటగుపడజాలదు. ఎటులనగా! సుషుప్తియందును సమాధియందును ఆత్మయుండును. ఆయవస్థయందహంకారము లీనమగుచున్నందున సుఖదుఃఖాదిధర్మముల సాక్షి యనుభవముగాకుండును. మరియు, జాగ్రదవస్థలో అహంకారము మెలకువయున్నందున సుఖదుఃఖములనుభవమునకు వచ్చుచుండును. కాబట్టి, పైజెప్పిన ధర్మములన్నియు అహంకారమందేయుండును. ఆత్మనిర్వికారమైయున్నది.

ఈవిధముగా సద్గురుడు బోధించగా నప్పుడు, శిష్యుడు సూక్ష్మవిచారణజేసి దేహాధ్యాసమునువదలి నేను బ్రహ్మరూపుడనని నిశ్చయించుకొని సంసారదుఃఖమునుండి విముక్తుండగును, ఎటులనగా, అరణ్యములోనుండు పులికూన గొఱ్ఱెలసహవాసమువల్ల నేను గొఱ్ఱెనను భ్రమలోనెట్లుండెనో యటులే అజ్ఞానియగు జీవాత్ముడు అనాదికాలమునుండి గల్గుచుండు జగత్స్వభావదోషమువల్ల నేనేదేహమునను భ్రమలో దగుల్కొనియుండెను.

ఈ ప్రకారముగా అనాదికాలమునుండి పొందుచుండు అజ్ఞానమువల్ల దేహాధ్యాసమగునని వర్ణించి యికమీాఉత్తరార్థమునందు, దేహాధ్యాసఫలము జననమరణాదిరూప సంసారదుఃఖప్రాప్తియగునని సద్గురుండు వర్ణనజేయుచున్నాడు.

ఈ జీవాత్మ తననిజస్వరూపమునుమరచి దేహభ్రాంతిలోజిక్కియెనుబదినాలుగులక్షల యోనులయందు దిరుగుచు, పునఃపునః జననమరణాదుఃఖములను భోగించుచున్నాడని యీాక్రిందిదృష్టాంతమువల్ల విశదమగును.

దృష్టాంతము॥ ఒక గ్రామమందొక గ్రుడ్డివాడుండెను. అతనికా యూరిలో ననేకశ్రమలు గల్గుటవల్ల నిర్జనప్రదేశమగు అరణ్యములో నుండ నిచ్ఛగల్గి నొక గృహస్థునితో అయ్యా! యీయూరి బైటికి బోవు మార్గమేదియని యడుగగా, యీయూరికొకటే ద్వారముండెను కావున నీవీకోటగోడకు చేయినానించుకొని పోయినచో యూరి బైటికి బోవుద్వారము నీచేతికి నగులును. నీవాద్వారముగుండా గ్రామబాహ్య ప్రదేశమునకు పోజాలుదువని చెప్పెను. అంత నాయంధుడు కోటగోడకు చేయానించి బహుప్రయత్నముగా నడచుచు ద్వారమువరకువచ్చుసరికి, అతనికర్మసంబంధయోగమువల్ల యతని శరీరమందుండు గోకుడు అతని నిల్వకుండ జేసెను. అపుడా గ్రుడ్డివాడు గోడనువదలి గోకికొనుట కారంభించెను అటులాగోకుడువశములో నతడు కొంతదూరము తన్ను తాగననివిధముననే నడిచెను. ఇంతలో ద్వారముగడచి మరల యాతడు గోడను పట్టుకొనెనుగాని అందువల్ల ప్రయోజనమేమి, అతడు గోకు కొనుచు నడచిన సమయమందే ద్వారముగడచిపోయెను. పాపమా గ్రుడ్డివాడు మరల గొప్పదయిన యాయూరిగోడను బట్టుకొని యెంతయో దూరముతిరిగితిరిగి వేసారి తుదకు దుఃఖించెనేగాని అతనికి ద్వారముమాత్రముఁ జిక్కకుండెను. అటులాతడు దిపుగుకాలమందు యెన్నియో ముండ్లాతని శరీరమునకు గ్రుచ్చుకొనెను. యెన్నియోచోట్ల మలినములందుబడెను, ఎన్నిచోట్లనో క్రిందపడెను. ఈవిధముగా అతడెంతయో దుఃఖము పాలయ్యెను గాని అతని ప్రారబ్ధకర్మవల్ల ఆద్వారమువద్దకు వచ్చినపుడెల్ల నొడలెల్ల తీటలేచి గోకికొనుటము. అందువల్ల ద్వారము విడచుటము, మరల యాగోడకు చేయానించి తిరుగడము యిటుల పునఃపునః అతఃకి మహాయాసముగలిగెను.

సిద్ధాంతము॥ ఈప్రకారముగా గ్రుడ్డివాడు అజ్ఞానిజీవుడని యెరుగవలసినది, ఊరుచుట్టుండుగోడ యెనుబైనాలుగులక్షలయోనులని ఎరుగునది, ద్వారమే మనుష్యజన్మము, శరీరమందుండుగజ్జి ప్రారబ్ధకర్మమని తెలియవలెను.

ఈదృష్టాంతములో జెప్పిన ప్రకారము అజ్ఞానియగుజీవుడు యెను

బదినాలుగులక్షల యోనులయందుబుట్టుచు చచ్చుచు ముక్తిద్వారమను మనుష్యజన్మంబెత్తి బ్రహ్మనిష్ఠాపరుండగు సద్గురూపదేశముచే, తనయొక్క నిజస్వరూపమును కనుగొని బంధవిముక్తుడయ్యి మోక్షమొందనగును గాని, గ్రుడ్డివానివలె తాను మోక్షద్వారమగు మనుష్యజన్మలక్షణమును మరచి కేవల విషయలోలుడై నానావిధకర్మలాచరించి ప్రారబ్ధమను గజ్జిరోగముగలవాడై ఆయుష్యమంతయు వ్యర్థముగా గడుపుచుండును, ఎటులనగా! గోకినప్పుడు మనస్సుకానందము గల్గుచుండును. అటులే విషయభోగము లనుభవించు మనుష్యునకు ఆనందము గనిపించునుగాని, యీజన్మము మోక్షద్వారమనిదెలిసి మనస్సును విషయములనుండి మరల్చి పరమేశ్వరునియందు ప్రీతిగల్పించుకొనక విషయములందు తగులుకొనిమోక్షద్వారమను శరీరము శుష్కించిన తర్వాత గోకుడువశమున ద్వారముదప్పిన గ్రుడ్డివానిగతి జీవుడు శరీరమునుండివెడలి యెనుబదినాలుగులక్షల యోనులను గోడను బట్టుకొనునట్లే జీవుడు తనకర్మసంబంధమునుబట్టి ఎద్దు గుఱ్ఱము గాడిద, మొదలుగాగల జన్మములెత్తి అనేక దుఃఖము లనుభవించుచుండును. అటువంటిపశువులను కొట్టుచు తిట్టుచు, మహాకష్టతరమైన పనులజేయించుచు మేతమైన చక్కగా వేయక బహుభంగుల బాధించుచుందురు. పాపమా పశువులకెంతమాత్రము స్వాధీనమనునది లేదుగదా! అయ్యయో వాటికెంతదుఃఖమగునోగదా, కష్టము జేసిచేసి అలసి యాయాసముజెందినప్పటికిని, నేను చాలా యలసితిననియు, నాకు నడువచేతగాదని చెప్పుట కాపశువులకు శక్యముగాకుండును, కాని దుఃఖముమాత్ర మనుభవింపవలసివచ్చును. కావున మనుష్యజన్మమెత్తి ఆత్మజ్ఞానము సంపాదించకుండినచో యిటువంటి దుఃఖము లనుభవింపవలసివచ్చును మరియు, పునః పునః జననమరణములు గలుగుచునే యుండును, కావున మనుష్యదేహము ప్రాప్తమైనప్పుడే మోక్షసాధనమును సంపాదించక అధర్మమందుజేరి, కేవల విషయభోగములందు మగ్నుండయ్యి తన యాయుష్యమంతయు వ్యర్థముజేసి యీదేహము వదలి పశుపక్షి క్రిమికీటకాది జన్మములెత్తుచు అనేక దుఃఖములనుభవించుచుండును, యిందుకు ప్రబోధ సుధాకరమను గ్రంథములో

శ్రీమచ్ఛంకరాచార్యులిట్లుజెప్పి యున్నారు.

శ్లో॥ నరదేహాదిశ్రిమణాత్ । ప్రాప్తిస్తౌపశ్వాదిదేహనామ్
స్వతనోరప్యజ్ఞానం । పరమార్థస్యతత్రికావార్తా॥

అనగా, ఆత్మజ్ఞానములేని మనుష్యుడు మరణించినపిమ్మట పూర్వ జన్మార్జిత పాపకర్మ పరిణామముగా, పశ్వాదిజన్మము లెత్తవలసి వచ్చును, యాపశువులకు తమ శరీరములకు దగినంతగూడా జ్ఞాన ముండదు, తదుపరి వాటి కత్యంత సుఖమయుంజగు బ్రహ్మ జ్ఞానము బోధపడునని నెందుకనవలెను, అనగా పశుపక్షులకు బ్రహ్మజ్ఞానముత్ప న్నముగాజాలదు. అటులైన పశుదేహమం దేముండెనని యెవరైన విచారించిన వారి కుత్తరంబిదియే; దుఃఖము భోగించుటేగాక మరేమి యుండదు.

గీ॥ ధరణిలోపలమనుజుడై తగజనించి • ఆత్మజ్ఞానంబులేమిచే నధికమైన • దుఃఖసాగరమునబడి తుదకుతాను • నీచజన్మంబులెత్తును నిజముసుమ్మి॥

ఆత్మజ్ఞానములేని మనుష్యుడు దేహము నశించిన పిమ్మట యెను బదినాలుగులక్షల యోనులయందు బోవలసివచ్చి, జీవునకు జననమరణ సమయములందు మొదటినుండి తుదవర కనేకవిధముల దుఃఖములే గల్గును, ఎటులనగా-మొట్టమొదట నెప్పుడైతేతల్లి గర్భవాసమందుండునో అట్టి సమయమందచ్చట మలమూత్రాది దుర్గంధవస్తువలవల్ల కఫము మొదలగు ధాతువులవల్ల, క్రిమిసముదాయమువల్ల, జఠరాగ్ని మొద లగు వానివల్ల ననేకవిధముల దుఃఖము లనుభవింపవలసివచ్చును. కాబట్టి, గర్భవాసము నరకవాసము, యీరెంటి కెంతమాత్రము భేదము గానుపింపదు, ఇంతియేకాక గర్భవాసమే మహానరకవాసమని చెప్ప వచ్చును, పిమ్మట జననకాలమునగూడా ప్రాణికెన్ని ప్రాణియొక్క తల్లి కెన్ని గలిగెడు దుఃఖమును వర్ణింప నలవిగాదు. యీదుఃఖము ప్రాణికెన్ని ప్రాణియొక్క తల్లికేదెలియును, తదుపరి బాల్యావస్థయందు పరాధీనత వల్ల, తరుణమందు స్త్ర్యాది విషయేచ్ఛవల్ల, వృద్ధత్వమం దశక్తతవల్ల నానావిధ రోగములవల్ల, స్త్రీపుత్రాదులచే యాగుచుండెడి యనాదరము

వల్ల, జీవుని కత్యంత దుఃఖము గలుచుండును, మనుష్యమాతృనిక యనుభవము పూర్ణముగా గలుచుండునని నిశ్చయముగా జెప్పవచ్చును, యుక మరణకాలమందు జననకాలము విధముగానే వేయితేళ్లొకేసారి యొకేచోట గుట్టిన ప్రాణికెంతదుఃఖమగునో, అంతదుఃఖ మీమరణించువానికగును, లేక, జీవించియున్నవాని చేతులు కాళ్ళు మొదలగు అవయవములను రంపముతో గోయుచుండిన నాతని కెంతదుఃఖమగునో అంతదుఃఖము మృత్యు సమయమందగును, ఈవిధముగా అజ్ఞాని పరాధీనమగు పాపిజీవునకు మొదటినుండి తుదవరకు జననమరణాది దుఃఖములు భోగింపవలసివచ్చును ఇందుకు శంకరానంద మునీశ్వరులు ఆత్మపురాణమందిట్లు వచించియున్నారు.

శ్లో॥ జాతో బాలో యువా వృద్ధో । మృతో జాతః పునస్తథా
బంభ్రమీత్యేవ సంసారే । ఘటీయంత్రసమోహవశః॥

అనగా, యీయజ్ఞాని జీవుడు సంసారమనెడు చక్రమునందు ఘటికా యంత్రము వలె (గడియారము) లేక, కుమ్మరిసానవిధముగా, గాండ్లవాని యెద్దువలె, పరవశుడై దిరుగుచు జన్మములెత్తి బాలుఁడగును, యౌవనుడగును, వృద్ధుడగును, తుదకు మరణించును. పిదప మరల జన్మించి మునుపటి విధముగానే స్వస్వరూపమును మరచి జననమరణరూపమగు ఘటికాయంత్రమువలె దిరుగుచు మహాయాతనల భోగించుచుండును, అని యిటుల వర్ణించి చెప్పగా యెనుబది నాలుగులక్షల యోనులందలి దుఃఖములను విని శిష్యునియొక్క మనస్సులో యత్యంత భయకల్పితంబై యీదుఃఖమెట్లు నివారణమగునని, ఆకస్మికముగా విచారణగలిగి సద్గురు చరణారవిందముల కొరగి హే స్వామీ! యీ జననమరణ దుఃఖసాగరమునుండి దొలగు మార్గము నుపదేశింపుడనుటయు, నంత యాసద్గురుండిట్లు నుడివెను.

తే-గీ॥ జననమరణంబనెదుఃఖ సాగరంబు । దాటిపోవలెనన్న సాధనమువినుము । సచ్చిదానందరూపుడౌ సాధువరుని। బోధయేముఖ్యమగునావబుద్ధిమతుడ॥

గురు॥ అనేకజన్మములనుండి చేయుచున్న నిష్కామవైదిక శుభ

కర్మఫల ప్రాప్తివల్ల, ప్రసన్నమైన యీశ్వరానుగ్రహమువల్ల, శాంతి, దాంతి, శ్రద్ధ, మొదలగు సాధనసంపన్నుడైన ముముక్షువు మెనుబది నాలుగు లక్షల యోనులనుండి తప్పించుకోవలెనన్న నిజమైన సాధుపురుషుని సమాగమము చేసుకోవలెను.

శిష్యు॥ గురువర్యా! సాధువులనగా నెట్లుందురు, కౌపీన కమండలాది బాహ్యవేషములచే లోకుల మోసబుచ్చుచు పొట్టనింపుకొను బుద్ధిచే దిరుగువారా, లేక యింకొకతీరుగలరా, యేసాధు సమాగమము వల్ల జననమరణాది దుఃఖము నశించునో దయజేసి వచింపగోరెదను.

గురు॥ ఒకే నాయనా! ఇదోవినుము.

సీ॥ భూతిగంపెడుబూసి బుడ్డగోచియుబెట్టి ♦ పులితోలువీపున బొందుపరచి ♦ దండిగామెడనురుద్రాక్షహారములేసి ♦ హస్తమందునకమండలముబూని ♦ జోలికప్పెరచంక వ్రేలాడగాగట్టి ♦ గడ్డంబుమీరారెడై బొడ్డునాన ♦ పాదయుగ్మమునందు పావుకోళ్ళుధరించి ♦ జడలెల్లభుజముపై చెంగలింప॥ నిట్టివేషంబులన్నియు పొట్టకొరకె ♦ బ్రహ్మగనుగొనువానికీ పలువిధముల ♦ వేషములతోడబనిలేదు వెఱ్ఱిగాదె ♦ సచ్చిదానందులట్లుండ జాలరెవుడు॥

ఇటువంటి వేషధారులు సాధులుగారు, వీరు జగద్వంచకులు, యెవరివద్ద సదాసమదృష్టి, వైరాగ్యము, క్షమ, శాంతి, ధైర్యము, దయ, నిరాడంబము, క్రోధరాహిత్యము, ద్వేషరాహిత్యము, శుచిత్వము, మొదలగు గుణంబులుండునో యతడే సాధువు, మరియు శ్రోత్రియుడు, అనగా! వేదవేదాంతార్థముల దెలసినవాడు, బ్రహ్మనిష్ఠుడనగా, పరబ్రహ్మస్వరూపమును గనుగొన్నవాడు యీ రెండింటియందెవరైతె సంపూర్ణులైయున్నారో వారే సద్గురువులు వారే సాధువులు, కావున ముముక్షులిట్టి సద్గురువుల సమాగమమందుండి నిజము గుర్తెరుగవలెను.

శిష్యు॥ గురురాజా! తాము శ్రోత్రియ బ్రహ్మనిష్ఠగలవారు సద్గురులని సెలవిచ్చుచున్నారు, కాని, యిందులో నొకటి యుండి యొకటి లేనిచో వారు సద్గురులుకారా, వారివల్ల ముముక్షులకు బోధయగునా లేదా వచింపవేడెద.

గురు॥ ఒకటియందుత్తీర్ణుండైనను గురునివల్ల నిస్సంశయబోధ గాఁజాలదు: కావున రెండిటియందు (ఆత్మజ్ఞానము శాస్త్రజ్ఞానమునందు) సంపూర్ణుఁడై యుండవలెను, యిందునుగూర్చి యొక దృష్టాంతముఁ దెల్పుచున్నాను వినుము.

దృష్టాంతము॥ ఒకానొకమనుష్యుఁ డొక దేశమునకు వెళ్ళి తిరుగ తనయూరికి వచ్చుచుండ మార్గమందొక నది గొప్పగా ప్రవహించుచుం డెను, అంత నాబాటసారి యానదిందాట నుపాయముదోఁచక విచారపడు చుండ, నంతలో యా నదీతీరమున బలిష్ఠమైన దేహముగల గ్రుడ్డివా డొక డాబాటసారితో, అయ్యా! నీవీ నదిని దాట నింతగా విచార మొందనేల నాభుజముపై గూర్చుండుము నీకెంతమాత్ర మపాయము గల్గకుండ యావతల గట్టుకు జేర్చెదనని పలుకుటయు, అది విని బాటసారి తనమదిలో, యీ గ్రుడ్డివాడెంత మాత్రమిీ నదిలోతుఁ గుర్తెరిగి యుం డడుకాని, తన శరీరబలమువల్ల నిటుల జెప్పుచుండెను, వీనివాక్కులు నమ్మినచో నీటిమధ్యమంద పాయంబుగల్గునని వానిమాటలకొప్పకుండెను, యింతలో నొక కుంటివాడతనిజూచి, అయ్యా! నేనీ నదిలోని జలమెచ్చ టెచ్చట నెంతలోతుగానుండునో చక్కగా గుర్తుపట్టజాలుదును, నన్ను నీవీపున నెక్కించుకొని నీటిలో ప్రవేశముగమ్ము, మనము నీళ్ళలో నడచునప్పుడు నేను మీఁదు వేలుచే గుర్తు జూపుచుండెద, అప్రకారమే నీవు నడచితివా త్వరగా నదిని దాటఁగలవని చెప్పెను అంత నాబాటసారి కుంటివాని మాటలువిని, వీఁడు మొదలే కుంటి. నీటియొక్క వేగము హెచ్చు తగ్గులు వీని కెట్లు తెలియును, వినిమాటలు నమ్మిన మెట్టి దుర్గతి సంభవించునోయని విచారపడుచుండ నింతలో, నొక సమస్తావయవములు గల్గి నిండు శరీరపుష్టిగల నొక మనుష్యుఁ డరుదెంచి యాబాటసారితో, అయ్యా! నీవీ నదిందాటుట కింతగాచింతింపపనిలేదు. మిమ్ముల నేనవలీల గా దాటింపగలను. గాన నాచెయ్యిని బట్టుకొని రమ్మని చెప్పగా, యా బాటసారి కాతని మాటలయందు విశ్వాసముగలిగెను. ఎట్లనిన, ఈయన యవయవములన్నియుఁ గలిగి బలశాలిగానున్నాఁడు, నేనీతని సహాయము వల్ల నదిని దాటగలనని మనంబున నిశ్చయించుకొని యాతని చేయిని

బట్టుకొని సుఖముగా యా నదిని దాటి తనయూరికి పోయి చేరెను.

సిద్ధాంతము॥ బ్రహ్మస్వరూపము బొందగోరు ముముక్షుడు; దృష్టాంతములో వచించినటుల బాటసారిగాను, జననమరణ కారణమగు సంసారము నదిగాను, బ్రహ్మస్వరూపప్రాప్తి, నది యావలి యొడ్డుగాను గ్రహింపవలసినది. మరియు, శ్రోత్రియుడనగా (శాస్త్రజ్ఞుని) గ్రుడ్డివానిగా దలచవలెను. ఎటులన, గ్రుడ్డివాడు తానుమాత్రము జ్ఞానసత్తావల్ల యావలియొడ్డును కనుగొనుచున్నాడుగాని, యితరునికి చూపజాలడు, మరియు కుంటివాడు బ్రహ్మనిష్ఠ (ఆత్మజ్ఞాని) గా తెలియవలెను, ఎటులన కుంటివాడు తన తెలివివల్ల నదియొక్క హెచ్చుతగ్గులు యూహించి తెలుసుకొనజాలునేగాని, ఇతరుల నాసంసారమను నదిని దాటింపజాలడు, అనగా! శాస్త్రజ్ఞానియు, ఆత్మజ్ఞానియు తాము తరించగలరుగాని, ఇతరుల తరింపజేయజాలరు. ఎటులన, సంసారమను నదిని దాటించ ముఖ్యసాధనములగు, అతనికి కండ్లులేవు. యితనికి కాళ్లులేవు వీరి నాశ్రయించి యీ యపారమైన నదిని సంసారి దాటజాలడు వారొకవేళ వారి ఆత్మశక్తిచే దాటించెదమన్న ముముక్షునకు విశ్వాసము గలుగదు, కావున దృష్టాంతములోని బాటసారిని యావలి గట్టుకుం జేర్చిన, కాళ్ళు కన్నులుండి శరీరపుష్టిగల మనుష్యునివలె, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠ (శాస్త్రజ్ఞానము బ్రహ్మజ్ఞానము) లందు సంపూర్ణుడైన సద్గురువు నాశ్రయించిన ముముక్షువును అవలీలగా సంసారమను నదిని దాటించి జననమరణ రహితమైన పరబ్రహ్మస్వరూపమగు యావలి యొడ్డున జేర్పగలడు, కావున ముముక్షు లిట్టి సద్గురువుల నాశ్రయించిన సంసారమను నదిని దాటుదురేకాని, కుంటివారి గ్రుడ్డివారి నాశ్రయించిన మరింత దుఃఖమునే పొందగలరు యిట్లుండ ప్రపంచములో కొందరు.

సీ॥ ఆలినివంచుకోజాలకనొక్కడు ♦ కొడుకులబిడ్డల నడుపకొకడు ♦
అప్పులవారిబాధలకోర్వకొక్కడు ♦ సోమరితనమందు జొచ్చియొకడు ♦
భూములుదిరిగెడు బుద్ధిచేనొక్కడు ♦ కాసులుగడియించు కాంక్ష
నొకడు ♦ జిహ్వారుచులకయ్యి చెడిపోయినొక్కడు ♦ మద్యపానంబుల
మరిగినొకడు॥ పొట్టబోడచిననక్షర మబ్బలేక ♦ యెన్నియోవేసములగంగి

ఒద్దువలెను ◆ దాల్చిగురువులమంచును ధరజనులకు ◆ బ్రహ్మజ్ఞానంబు బోధింప బరిగిరకటా॥

☞ చదువరులారా! పైసంగతుల గ్రహించితిరిగదా! ఆత్మజ్ఞానము సంపాదించ దలచిన మనుష్యు డెవరి శరణుబొంద వలెనో మరియు, బ్రహ్మజ్ఞానము ప్రసాదింపజేయు పురుషులెట్లుందురో తమకి గ్రంధావలోకనమువల్ల తెలసియేయున్నది. యిక నీజమానలోని గురు శిష్యుల కొందరిఁ దిలకించండి యీ ప్రపంచములోని గురువుల నొక్కింత యాలోచన దృష్టితో గమనించిన లేశమాత్రమేని బ్రహ్మజ్ఞాన సంబంధ సంగతులు కనుపట్టవు. కొందరు గురువులమని చెప్పుకొనెడి వారలను, పొట్టంత జీల్చి చూచిన అక్షరమన నెట్టిదో కనుపించదు. మరియు యేకొద్దిగనైన చదువ తెలివియున్నచో అర్థజ్ఞానమే యుండదు. వొకవేళ అర్థజ్ఞానముండెనా, కాబట్టిన కుండేటికి మూడే కాళ్ళనునట్లు నాదే పాడువనుచుందురు. వీరినే చదివిన మూర్ఖులందురు. యింతకు మిగిలి శాస్త్రజ్ఞాన సంపాదకుడైన, బ్రహ్మజ్ఞానము గల్గుట చాలాకష్టము. యిట్లెందరో గురువులు ప్రపంచములో మోసక రూపులైయున్నారు. వారల నెంతవరకు వర్ణింపగలము, యిక శిష్యుల అవగుణములన్నచో లెక్కయేలేదు. పదియారు వత్సరములనాటికే మంత్రోపదేశము ఛీఛీ, యీప్రపంచములో నెటువైపుజూచిన దొంగగురువులు వెంగిలిశిష్యులే గన్పట్టుచుండిరి. సత్యము చెట్లలో చేరినది, అసత్యము మనుష్యుల నల్లుకున్నది. యీవిషయము పాఠకులూహింతురని యింతటితో విరమించెదను.

మోక్షాపేక్షగల ముముక్షుడు శాస్త్రాత్మ జ్ఞానసంపన్నుడైన గురుని జేరి వినయవిధేయ పూర్వకముగా శరణుబొందవలె నిందుకు భగవద్గీతయందు శ్రీకృష్ణభగవాను లిట్లుచెప్పియున్నారు.

శ్లో॥ తద్విద్ధిప్రణిపాతేన । పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యామి తేజ్ఞానం । జ్ఞానినస్తత్వదర్శినః॥

ఇటుల సద్గురునికి సాష్టాంగ నమస్కారముజేసి స్వామీ! బంధన మననేమి, మోక్షమననేమి అవిద్యయని దేనిన నెదరు ఆత్మయన నెవరు

పరమాత్మయన నెవరు యీరెండొకటిగా నెట్లు దెలియవలెను, అని యిటుల వారిని విచారించి వారి సేవజేసి నీపై వారికి దయగల్గేలాగున నటించుచు నీపై వారికి సంపూర్ణ కరుణాకటాక్షము గలిగేవిధము జేసుకొంటివేని ఆసత్పురుషుడు నీవినయమునకు మెచ్చి పరమశ్రేష్ఠమైన మోక్ష సాధనమగు అద్వితీయ బ్రహ్మజ్ఞానము నీకు గల్గునటుల నుపదేశము జేయుదురు, అట్టి సద్గురూపదేశమువల్ల నిజసుఖము గల్గును. ఇహపరలోకములం దనుభవించు విషయ భోగములన్ని కర్మ జన్యములుగా ననాశవంతములై దుఃఖములిచ్చునవిగాయుండును కావున నాశరహితమైన పరమసుఖమొనంగు బ్రహ్మజ్ఞానము నొందగోరినయెడల వేదవేదాంతార్థములను చక్కగా దెలసికొని పరబ్రహ్మముయొక్క అపరోక్షానుభవుడైన సద్గురుని శరణుబొందవలెను.

శిష్యు! ఇటువంటి సద్గురు శరణుజొచ్చి యేమిచేయవలయును.

గురు! సద్గురు శరణుజొచ్చిన ముముక్షువు గురువు నుద్దేశించి మహారాజా, యీసంసారమందు జేరిన నాకు జననమరణ దుఃఖము లెట్లు దొలగును, యిందుకే యేకర్మల జేయవలయును, యేసాధనముండవలెను. యెటులైతే యీభవసముద్రమునుండి తరించగలనో, యీసంసారమందు జేరి దుఃఖమనుభవించుచున్న నేనెవరను, అని యీవిధముగా సమయోచిత వాక్యముల విన్నవించి గురురాయా! యీదాసునిపై కృపజేయుడని ప్రార్థించవలెను, ఇటుల వేడుకొను శిష్యుని మొరవిని గురుడు దయదలంచినవాడై జననమరణ రహితమగు మార్గము బోధించు నెటులన.

హే ముముక్షో! నీవు నీయొక్క స్వరూపమును గనుగొంటివా నీవే సచ్చిదానంద స్వరూపుడవు దేహము, ఇంద్రియములు, ప్రాణి, మనస్సు, బుద్ధి, వీటికి సాక్షి ప్రత్యగాత్ముడు. యింక నీదేహేంద్రియములు నీవుగాక, దేహముయొక్క వర్ణాశ్రమాది ధర్మములున్ను ఇంద్రియ ధర్మములు మొదలగునవి నీస్వరూప మెంతమాత్రముగా జాలదు, నీవు శుద్ధచైతన్యస్వరూపుడవు యిట్టి జ్ఞానము నీయందెవుడు గల్గునో, అప్పుడే నీజననమరణములు దూరమవును. యిది నిశ్చయమైన

సిద్ధాంతము. యీ సిద్ధాంతమునకు శ్రుతివచనము లెంతయో బలమొసగుచున్నవి కావున జ్ఞానమువల్లనే మోక్షము లభించును. ఆత్మను గనుగొన్నంతనే జీవుడు మృత్యువు నోటనుండి తప్పిన వాడగును, జ్ఞానం వినా మోక్షము నొసంగు సాధన మొద్దియు లేదు. ఆత్మజ్ఞానము లేక జపతపఃక్రియలవల్ల మోక్షము గల్గదు. ఎటులన, యీకర్మలన్నియు అంతఃకరణ సిద్ధి సాధనములు, మోక్షమునకు సాధనము కేవలజ్ఞానమే యగు నదియు ఎటులనగా! అన్నము వండవలెనన్నచో, కట్టెలు, ధాన్యము, పాత్రలు, మొదలగు సాధనము లుండినప్పటికిన్ని అన్నముగాజాలదు, అన్నముగావలెనన్నచో అగ్నియొక్క సహాయము గావలసియుండును. యీప్రకారముగా జ్ఞానములేక మోక్షము లభింపదు. కాబట్టి నీవు నీనిజస్వరూపమును దెలిసికొమ్ము అట్టి జ్ఞానమువల్లనే జననమరణాదులు నివృత్తి కాగలవని శ్రుతులు మొరలిడు చున్నవను మాట యథార్థము. కాన, నీవు సద్గురువాక్యములయందు విశ్వాసముంచితివా నీజననమరణంబను లలాట పత్రిక పటాపంచలైపోవును. అంతటితో మోక్షము జెందిన వాడవగుదువు. యిందు కెంతమాత్రము సందియము లేదు.

శిష్యు! గురువరా! తాము జననమరణ లలాట పత్రికయంటిరే దాని యర్థమేమి?

గురు! వచించెద శ్రద్ధతో వినుము, ప్రతిజీవుడొనరించు పుణ్యపాపముల యొక్క లెక్క యమధర్మరాజుకు గుమస్తాయగు చిత్రగుప్తుడను నాతడు చూచుచుండును, ఆలెక్క ప్రకారముగా యముడు లలాటపత్రిక తయారుజేసి దానిలో నున్నటుల జన్మాది సుఖదుఃఖములు జీవున కొసంగుచుండును, అందువల్ల జీవునకు యెనుబదినాలుగులక్షల యోనులందు దిరుగవలసి వచ్చునని యిటుల పురాణములందు జెప్పబడియున్నది. కాబట్టి యీ లలాటలేఖను దప్పించి జననమరణ దుఃఖమునుండి దొలగించి సద్గురుడు జీవునికి సచ్చిదానంద నందమైన ఆత్మనుగూర్చి బోధించును కావున, సద్గురువాక్యములందు దృఢవిశ్వాసముంచి వారి యుపదేశ వాక్యములను అనుభవమందుంచితివేని నీలలాటపత్రిక విచ్ఛిన్నమైపోవును, అప్పటికి నీవు జననమరణములనుండి తప్పినవాడవగుదువు. ఇది బహు

సూక్ష్మవిచారముతో కనుగొనవలసినదిగాన, యిందునుగూర్చి యొక దృష్టాంతము జెప్పెదవినుము.

దృష్టాంతము॥ ఒక సాహుకారి మూర్ఖత్వముతో తన వద్దనుండు ద్రవ్యము దుర్జనులకు అప్పుగా నిచ్చుచుండెను, యిటు లిచ్చుచుండగా యాతని ద్రవ్యంబంత వ్యయమైనదేగాక యింకా తానొకరికి బాకీ యయ్యెను, కొంతకాలమునకు కతని సాహుకార్లు తమ బాకీ నివ్వుమని బాధింపసాగిరి, అప్పుడాతనిచేతిలో నొక కాసైన లేనందున తనకు బాకీ వున్నవాండ్లను యడుగబోయిన యాదుర్జనులు తిట్టెదరో కొట్టెదరో యని భయపడుచుండెను. ప్రతిదినము తాను బాకీవున్న సాహుకార్లు మాత్రము అధికముగా బాధింపసాగిరి, అందుల కాతనికి మార్గము దోచక చింతించి యొకరివద్ద కొలువుండియైనా వీరియప్పు దీర్చెదనని నిశ్చయించుకొని ఒక చిన్న దుకాణంలో కొద్ది జీతముతో కొలువు గుదిరించుకొనెనుగాని, అతని జీతము యింటికర్చులకే సరిపడకుండెను. ఇక అప్పుదేర్చుటెట్లు దినదినము వడ్డీలచే అప్పులు పెరుగుచుండెను, అట్లాతనికి దినదిన మాధనికులచే హెచ్చు బాధలు గల్గుచుండ, అతని స్నేహితు డొకడుజూచి ఓ స్నేహితుడా! నీవు దారిద్ర్య దశవల్ల నేదియు దోచక చెడిపోవుచుంటివి నీవు దెచ్చునట్టి జీతము స్వల్పము. దానిచే నీవు ఋణము దీర్చజాలవు. కాబట్టి నేనొక యుపాయము జెప్పెదవినుము. నదేమన, ఈవూరిలో ధర్మదత్తుడను సాహుకారి గొప్ప శ్రీమంతుడు నీవాతని నాశ్రయించినచో నీకష్టము దీరగలదు కాని, ఇందులకై నీవు శ్రద్ధ వహించవలసియున్నది. ఎటులన, నీవాధర్మదత్తుని వద్దకుపోయి యేదైనా నొక పని జెప్పుండని కోరవలసినది, వారు నీకు పనిజూపిన తర్వాత భయభక్తి విశ్వాసములతో శ్రద్ధబూని చక్కని బుద్ధితో పని జేయుచుంటివా, ఆధర్మదత్తుడు మెచ్చి నిన్ను ఋణమునుండి విముక్తుని జేయగలడని వచింప, నాతడా ధర్మదత్తుని వద్దకుబోయి నాకేదైయై పని జూపుండని కోర యాతనికొక చిన్నపనిని వారు చూపించిరి, అట్టి సమయ మందితడు కడు శ్రద్ధతో యావత్తుగా జూచుచు యెల్లకాలములయందు భయభక్తి విశ్వాసములు గల్గి నిరంతరము కృషిసల్పుచుండ ధర్మదత్తు

డాతని గుణములకు మెచ్చి తన గుణములకు మెచ్చి తన గుమస్తాలందరిలో పెద్దగుమస్తాగా వీరిని నియమించిరి, కాని యితడు యింటికర్చుకంటె ద్రవ్యమెక్కువగా దీసుకోకుండెను, ధర్మదత్తుడప్పుడతనితో జీతము సరిగా దీసుకుంటులేవెందుకన, నాకక్కరలేదని చెప్పుచుండెను, అందులకు ధర్మదత్తుడు చాలా మెచ్చుచుండెను, ఇటుల కొంతకాలము గడచిన పిమ్మట అతడు బాకియున్న సాహుకారులలో నొకడతనిని త్రోవలో నడ్డగించి మా ద్రవ్యము మాకిచ్చెదవా లేదాయని నోట అనరాని మాటలన్నందున చాలా చిన్ననైన ముఖంబుతో దుకాణములోకి వెళ్ళెను. ధర్మదత్తుడతనిజూచి, నేడేమో చింతజేయు చున్నట్లు దోచుచున్నది నీకువచ్చిన యిబ్బందులేమో వచింపుడన అయ్యా! నేనింతకుపూర్వము కొంతధనికునిగానుంటిని గాని దుర్బుద్ధిచే నాద్రవ్యమంతయు దుర్జనుల పాలొనరించి తుదకు నేనొకరికి రుణినైతిని అటుపిమ్మట యప్పుదీర్చుమార్గము గనుపించక యెన్నియోప్రయత్నములు జేసితినికాని, నాప్రయత్నము సంసారముకే సరిపడక దినదినమప్పుబెరుగుచునేయుండెను. యిన్నిరోజులనుండి తమదుకాణములో నేను కొలువుజేయుటవల్ల అప్పులవారొకరైనా యడుగకుండిరిగాని నేడొక ధనికుడు నన్ను త్రోవలోనడ్డగించి నోట యనరాని మాటలని నామనస్సునొప్పించెనని చెప్పగా, నంత యాధర్మదత్తుడు గుడ్లెర్రజేసి యిన్నిరోజులనుండి నాకేల జెప్పకుంటివి, యీసంగతి నాకుదెలసియుండినచో నాడే నిన్ను రుణవిముక్తునిగా జేయుదునేయని వచించి, అయిన పనికి చింతించిన ఫలములేదు కాబట్టి నీవెవరెవరికి బాకియివ్వవలసి యుంటివో వారివారి నామములను నాకు దెలియజేయుమని, వారివారిని, వెంటనేరప్పించి యెవరికెట్లు యివ్వవలెనో వారివారి కటులిచ్చిపంపి తన యొక్క గుమస్తను రుణవిముక్తునిగా జేసెను.

సిద్ధాంతము! మూర్ఖుడగు సాహుకారియనగా, జీవుడు, కామక్రోధాది అరిషడ్వర్గంబులను దుర్జనులయొక్క సాంగత్యమున, ఆత్మరూపమగు తన ధనంబెల్ల పాడొనర్చి పిమ్మట నేను సంసారిని కర్తను భోక్తననుచు యిటులనేక విధముల దలంచుచు, అజ్ఞారూపుడై పాప

పుణ్యాదికర్మసంబంధమున యాయమధర్మరాజుకు బాకీగలవాడయ్యెను, అప్పుడా పాపపుణ్యాది సర్వకర్మఫలంబులను తిరుగయనుభవించు సంబంధమగు యాతని లలాటపత్రిమను దస్తావేజు యముండువ్రాసియుంచెను. దానివలన జీవుడుపదేవదే జన్మములెత్తి మరణింపవలసివచ్చుచుండెను. అటుల స్వకర్మఫలప్రాప్తివల్ల గల్గుచుండు జననమరణాదిదుఃఖములనుండి దొలగిపోవలెనను హేతువుచే జీవుండొక గురుని సన్నిధానముకరిగెను, కాని, యాతని దుర్దైవమువల్ల యాగురుడు ద్వైతవాదుడగుటచే జీవుడెంత సేవజేసినప్పటికిన్ని జననమరణాదిదుఃఖమునుండి దొలగిపోవుటకాగురునివల్ల సదుపదేశముగానందున, అతనిదుఃఖము యధాప్రకారముగానేయుండెను. ఇంతియేగాక, సంసారమువల్ల అనేకపీడలే గల్గుచుండెను. ఇటుల కొంతకాలముగడచిన పిమ్మట యాజీవునియొక్క పూర్వమందొనర్చు నేదోపుణ్యంబున సన్మార్గవర్తనుండగు నొక జ్ఞానసంపన్నుడగు మిత్రుండాతని దిలకించి ఒరే నాయనా! యిట్టిభేదవాదిగురువునాశ్రయించిన నీకేమిలాభము యిట్టిగురువులన్నచో నాలుగుడబ్బులు సంపాదించవలెనను కోరికగలవారలై గురువులమని పేరుబెట్టుకొని శిష్యులవిత్తంబపహరించుచుందురు ఎటులన

సీ॥ అచ్చటచ్చటకొంద రాడుమాటలునేర్చి ♦ యితరులకునుబోధనిచ్చువారు ♦ ద్రవ్యవాంఛచె నిజధర్మంబువిడనాడి ♦ మంచివారలమోసగించువారు ♦ జహ్వారుచులచేతజీవహింసలుజేసి ♦ నరపిశాచములనబరగువారు ♦ అద్వైతమనికొందరాడుటవిని సర్వమెుక్కటేయనిచాలమొరగువారు॥ రూఢిపగలెల్లదిరుగుబహురూపివలెను ♦ వేసములుదాల్చియునువిర్రవీగుచుండు ♦ దొంగగురువులువీరునీదుఃఖమెట్లు ♦ దీర్చజాలుదురోనీవుదెలియుసఖుడ.

హేసఖుడా! యిట్టి గురువులసేవించిన జననమరణరూపమగు దుఃఖసాగరమునుదాటింతురా లేదు, అనగా పరమప్రాప్తిగాజాలదు, ఇటువంటిగురువుల సాంగత్యమును త్యజించి, ఒకానొక వేదవేదాంతపరుండును బ్రహ్మనిష్ఠగలవాడును వైరాగ్యసంపన్నుండునగు సద్గురు నాశ్రయించి నిష్కపట నిష్కామబుద్ధిచే త్రికరణశుద్ధిగా యాసద్గురునిసేవ

జేయుము. అట్లుజేసితివేని యాయన నిన్ను కరుణించి, యమధర్మరాజు దర్బారులోవ్రాసియుంచిన నీలలాటపత్రిమును చించివేయునుపాయము నీకు బోధించును. అని యిటుల వచించుమిత్రుని వచనములాలించి బ్రిహ్మవేత్తయగు సద్గురునాశ్రయించి నవవిధభక్తులతో శుశ్రూషలుజేసి యాగురున కత్యంత సంతోషము గల్పించెను అంతనాసద్గురుడు ఓయీ! నీకోరిక యేమో విన్నవించుము నీకెట్టియిక్కట్టులున్నను వాటిని దొలగు నుపాయంబు నేవిన్నవింతునన, మహారాజా! అధ్యాత్మ అధిభౌతిక అధి దైవికములను త్రివిధతాపములవల్ల నేను చాలా తపించియున్నాను నేనిదివరకుజేసియుండిన పాపపుణ్యాదికర్మలయొక్క వివరము యమధర్మ రాజు తనవద్ద పత్రిముగావ్రాసి యుంచికొనియున్నాడు, అట్టిపత్రిము చిందరవందరైనశించిపోవు నుపాయంబేదైన వచింపుము యేయుపాయం బున నేను విముక్తుండనయ్యెదను అని శిష్యుడిటుల వేడుకొనగా గురుం డిట్లనియె, సమస్తపాపకర్మలువదలి పుణ్యకర్మలు యీశ్వరార్పణముజేసి శాంతిశమదమాది సంపన్నుడవై దుర్జనసహవాసమునువదలి నీవు నాయుప దేశమందు విశ్వాసముంచుము, ఉపదేశమననిదియే, స్థూలదేహము దృశ్యము అనగా కనుపడుచుండునది, నీవు ద్రిష్టవు. అనగా చూచువాడ వగు ఆత్మవు, యిందునగూర్చి నీవెన్నటికి దేహమువుగావు. యీ దేహ మును జీవివెళ్ళినతర్వాత కాల్చెదరు. యిదియెట్టికర్మలనుభవించునది గాదు. దానికిసాక్షివగు నీవు ఆత్మవు, నీవుదానియందు సంపూర్ణవ్యాప కుడవైయుండుటవల్ల నెటుకదలజాలవు. ఎటులనగా! ఆకాశముఅంతట నిండియున్నందున అట్టి యాకాశము నెటుపోజాలదు, అటులే నీవీశరీర ములోనుండి యెక్కడికి పోవువాడవు వచ్చువాడవుగాక యున్నావు. అందువల్ల నీకు కర్మలతో నేమాత్రము సంబంధములేదని స్పష్టమగుచుం డును, యిట్లు స్పష్టమైనతర్వాత కర్మఫలమనుభవించువారెవరని సందే హముగల్గును, యీసందేహమునకిదే యుత్తరము, దేహము ఆత్మ యీరెంటినివదలిన, మిగత, చిదాభాసమను జీవసంయుక్తలింగదేహము పాపపుణ్యకర్మల సంబంధమునననుసరించి యుచ్చనీచ శరీరములందు ప్రవేశించి జననమరణ సుఖదుఃఖములనభవింపజేయుటకు జీవాత్మను

జూచినయెడల విస్మయముకొనుంది. తన నిజస్వరూపమగు సచ్చిదానంద ఆత్మజ్ఞానస్వరూపుఁడైనంతలో లింగదేహమునశించి సర్వకర్మలుకాలి భస్మమగును, అప్పటికి కర్తృత్వభోక్తృత్వములుండవు. ఈయమధర్మరాజు వద్దనున్న పత్రమెవరిపేరుదో వారేలేనప్పుడు వారిరాజీకమందున్నపత్రిక కూడాలేకుండ చిందరవందరజేసి వేయుదురు. గాన యిందునుగూర్చి దేహము యింద్రియములు మనోబుద్ధి చిత్తాహంకారములనువదలి సచ్చిదానందుఁడవై నిత్యముక్తుఁడవైయుండఁగోరిన యెడల స్వతః నీవుజ్ఞానమే సంపాదించవలయును; జ్ఞానము వినా జననమరణ రాహిత్యముగాదు యిది ముమ్మాటికి నిజము.

శిష్యు॥ మహారాజా! నాకర్మము అనంతకాలమునుండి గల్గినది, మరియు దేహభ్రాంతియనే అజ్ఞానము బహుజన్మములనుండి వచ్చుచున్నది కావున వీటి నివృత్తికి బహుకాలముపట్టును, మీరేమో సద్గురువాక్యములందు విశ్వాసముంచితే ప్రారబ్ధమను లలాటపత్రిక చిందరవందరయగునని చెప్పుచున్నారు అది యేవిధముగాయగునో వచింపగోరువాడను. గురు॥ నాయనా! నీకర్మము నీదేహభ్రాంతి యజ్ఞానము అనాదికాలమునుండి వచ్చినదైనను జ్ఞానమెప్పుడు గల్గుచున్నదో యప్పుడేయవిదొలగిపోవును. అజ్ఞానము సంపాదించు వేళపట్టునేగాని అజ్ఞానము దొలగగొట్టుటకు వేళ్ళపట్టదు ఎటులనగా.

దృష్టాంతము॥ ఒకపర్వతమందొక గుహాయుండెను, ఆగుహాలో నిండాచీకటియుండె, ఆచీకటిని దోలుటకై జపతపములు లేక గడ్డపారలు గొడ్డండ్లు తుపాకులు మొదలగునవెన్నైనను చీకటిని పారదోలనగునా కాదు, చీకటిగి శాపుటకు దీపమే కావలెను. యెందుకనగా దీపమును జూచిన తక్షణమే చీకటిపారిపోవునేగాని, నేను చాలారోజులనుండియున్న నన్నొకనిమిషములో బారదోలిన నేనెట్లు పోగలనని యాచీకటియనునా, యనదు. అటులే జ్ఞానమను చీకటిదొలగిపోవుటకెంతమాత్ర మవకాశముపట్టదు అజ్ఞానమువల్ల గల్గుచుండు దేహాధ్యాసము ప్రారబ్ధము దీర్ఘకాలమునుండే వచ్చుచున్నవికాని (అహంబ్రహ్మాస్మి) అను అపరోక్షజ్ఞానప్రకాశమెప్పుడు నీయందుగల్గునో యప్పుడే అజ్ఞానియగు అహం

కారము నశించును. ఇందుకు వేదాంతప్రమాణము (1) దేవునిదెలిసి నంతనే సర్వబంధములు దొలగును. (2) బ్రహ్మమును కనుగొన్నవారికి పరమపదవి లభించును. (3) జీవుడు ఆత్మను దెలసినంతనే చావును గెల చినవాడగును. (4) జ్ఞానములేక వేరే మార్గమువల్ల మోక్షము లభింపదు: కాబట్టి, జ్ఞానమువల్లనే సర్వకర్మలు నశించునని శ్రీకృష్ణభగవానులు భగవద్గీతయందిట్లు నుడివెను.

శ్లో॥ యథైధాంసిసమిద్ధోగ్ని । ర్భస్మసాత్ కురు తేర్జున:
జ్ఞానాగ్నిఃసర్వకర్మాణి । భస్మసాత్ కురు తేతథా॥

తా॥ అర్జునా! జ్వాలలతో ప్రజ్వలించుచుండే అగ్ని కట్టెలనెట్లు భస్మముజేయునో, అటులే అభ్యాసముచే ప్రబలమైన జ్ఞానాగ్ని పాప పుణ్యాది సర్వకర్మలను భస్మముజేయును.

శిష్యు॥ గురువరా, ఆత్మజ్ఞానమువల్ల మోక్షము గల్గునని యంటిరే, అట్టి యాత్మజ్ఞానము నాకెట్లుగల్గును.

గురు॥ వేదాంతగ్రంథములలోని పంచీకరణమును చక్కగా విచా రణజేసితివేని నీకు ఆత్మజ్ఞానము తప్పక గల్గును, దానంజేసి జననమరణ రహితమగు మోక్షము ప్రాప్తించును.

శిష్యు॥ మహారాజా! వేదాంత గ్రంథములందుండు పంచీకరణ విచారమువల్ల ఆత్మజ్ఞానము గల్గునని చెప్పచుంటిరి, కాని, అందులోనుండు విశేషములేవియో దయచేసి వచింపగలందులకు ప్రార్థన.

గురు॥ అరే నాయనా! అందులో పంచభూతముల వివరమున్ను అనగా పృథివి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము, యీ యైదింటి వివరము, స్థూలసూక్ష్మ కారణములను త్రివిధదేహములయొక్క తత్వ ములు వేరువేరుగా వివరణజేసి వాటివాటి వర్ణనముతో స్పష్టమగునటుల భౌతిక తత్వములనుండి వేరుగా ద్రష్టయై సాక్షిగానుండు ఆత్మ తత్వ ముందులో చెప్పబడియున్నది గాన, పంచీకరణముయొక్క అర్థము బ్రహ్మనిష్టగల సద్గురుసన్నిధిని శ్రవణముజేసితివేని ఆత్మతత్వము నీకను భవము కాగలదు. యీ అనుభవము (జ్ఞానము) వల్ల వర్తమానమందలి, అనగా, యీ జన్మమందే బ్రహ్మ సుఖమనుభవించగలవు.

శిష్యు॥ స్వామీ! బ్రహ్మనిష్ఠగల సద్గురువద్దనే శ్రవణము జేయుమనిదరు. ఏల, యీవేదాంతగ్రంధములు ప్రాకృతభాషలో నుండుట వల్ల నార్థము కాగలదు నేనే చదివినచో జ్ఞానముగల్గదా, తాము సద్గురుముఖముగనే వినుమన నేమికారణము.

గురు॥ నాయనా! నీకు వేదాంత గ్రంధములందలి అక్షరములు దెలియును శబ్దార్థముగూడా తెలియునుగాని, అందులోనుండు మర్మములు నీకెంతమాత్రము బోధపడవు. కావున సద్గురువద్దనే దెలియనగును. యిందుకొక దృష్టాంతము దెల్పెద సావధానమతివై వినుము.

దృష్టాంతము॥ ఒక గృహస్తుడు చాలా ద్రవ్యముగలవాడై యుండెను, యిట్లుండ నొకనాడతనికిట్లు విచారముగలిగెను, యేదేమన, ఇప్పుడు నావద్ద చాలా ద్రవ్యమున్నది యిందులోనుండి కొంత ద్రవ్యము నేదైన నొక గుప్త ప్రదేశమందు దాచిన కష్టకాలమందు అక్కరకు వచ్చును లేదా, నేను సమీపమందు లేని కాలములో నావారి కుపయోగమగునని ఆలోచించి తన స్వంత తోటలో నతడు గట్టించిన శంకరుని గుడి యొకటుండెను. ఆగుడి శిఖరములో యెవరికి దెలియకుండ యిరువై లక్షల ధనము జతనముచేసి నొకదస్త్రములో నిట్లు శక: ౧౮౫౬ భావ నామ సం॥ అధిక వైశాఖ బ॥ ౧౨ గురువారంనాడు గంటలు ౧౨కు శంకరుని గుడి శిఖరములో యిరువైలక్షల రూపాయీలు యుంచినాను. యెప్పుడు అవసరముంటె అప్పుడు తీసుకోవచ్చునని వ్రాసి అట్టి దస్త్రమును కడుజాగ్రతతో కాపాడుచుండెను యిట్లుండ కొన్నాళ్ళు గడచిన పిమ్మట యీగృహస్తు డాకస్మికముగా మరణించెను. అటుపిమ్మట యాతని భార్యయున్ను కుమారుడున్ను యెప్పటివలె వర్తకము చూచుచుండిరి, యిట్లుండ కొంతకాలమునకు వారివద్దనుండు ద్రవ్యమంతయు సెలవైనదే గాక యితరులవద్ద కొంతద్రవ్యము అప్పుగాదెచ్చి వాడుకొనిరి, యిటుల కొంతకాలము గడచినపిమ్మట అప్పులవారొచ్చి మాద్రవ్యము మాకిమ్మని బాధింపజొచ్చిరి, అందులకా శ్రీమంతుని కొమారుడు తన మదిలో విచారణజేసి, మానాయనగారు గొప్ప శ్రీమంతుడగుటచే పెద్దగా వ్యవహారము జేసియుండిరి, వారి దస్త్రములన్నియు వెదకిచూచినచో మన

కెవరైన యిచ్చేవారుండిన యిప్పటి కష్టదశకు చాలా మేలగునని యెంచి వెనుకటి దస్త్రములన్నియు వెదక నారంభించెను, అంతలో తన తండ్రి గారిచే శంకరుని గుడి శిఖరమందు యిరువదిలక్షల రూపాయీలు యుంచినట్లుగా వ్రాసియున్నది అగుపడెను, అది గనినతోడనే పెన్నిధిగన్న పేదచందంబున వెంటనే పనివాండ్లను రప్పించి యాగుడి శిఖరమును కూలగొట్టించి వెదకెనుగాని, అందులో ద్రవ్యము లేకపోయెను. అదిగని యాపిల్లవాడు బహు చింతాక్రాంతుడై గుందుచు, యాదస్త్రమందుండు తన తండ్రితో వ్రాయబడిన పద్దు నెందరికో జూపెను. అదిచదివిన వారెల్లరు శిఖరములో ద్రవ్యమున్నదని స్పష్టముగా వ్రాయబడియున్నది. నీవు మంచిగా చూడుమని నొకరు చెప్పిరి, యింకొకరు శిఖరముకై యింతద్రవ్యము కర్చుయగుటచే నట్లు వ్రాసియుండవచ్చుననిరి, మరి యొకడు శిఖరము కింతద్రవ్యము యెందుకుపట్టుననెను మరికొందరు యిది అబద్ధము వ్రాసియున్నాడనిరి, యిటుల యెవరెవరికెట్లు దోచెనో యట్లు నుడివిరేకాని, దానిలోనుండు మర్మము నొక్కరైనా దెలియకుండిరి ఆసమయమం దాపిల్లవాడు తన వంశమందలి నొక ముసలితాత వద్దికేగి తాతా! ఇదో మానాయనగారి వ్రాతను చూచితిరా, నేనీవ్రాతను నిజమనినమ్మి గుడియొక్క శిఖరమును పడగొట్టించి నల్గురిచే, తండ్రి గుడి గట్టించితే కొడుకు గూలగొట్టించెనని అపయసము బొంది దుఃఖపడ వలసివచ్చెను, మరల గట్టించెదనన్న అన్నముకే కష్టపడుచుండు నావద్ద నొక రూకైనా లేదు, నాకీ యపయశము దొలగు మార్గము గనుపింప దనివచింప నందుల కావృద్ధుడు చాలా విచారపరుడు గావున యాదస్త్ర మందలి వ్రాతనుజూచి, నిదానించి దాని మర్మముం దెలసికొని బాలకా! నీవేమాత్రము చింతింపకుము నేను రెండువందల రూపాయీలు నీకిత్తును. నీవా శిఖరమును మునుపటివలె మరల గట్టించి వైశాఖ బ॥ ౧౨ నాడు తప్పక నావద్దికి రావలయునని చెప్పెను, అంత నాపిల్లవాడు తాతగారు వచించినటుల శిఖరము యెప్పటి యట్లు గట్టించి వైశాఖ బ॥ ౧౨ నాడు తాతగారివద్దికి వచ్చెను. అంత నావృద్ధుడు పిల్లవానితోగూడా పండ్రెండు ఘంటలకు శంకరాలయమునకు వచ్చి నలుదిక్కులజూచి బాలకా యిదో

చూడుము. శిఖరముయొక్క నీడ యేప్రదేశమందు సోకెనో అచ్చట త్రవ్వుమని చెప్పెను. అప్పుడా పిల్లవాడా శిఖరముయొక్క నీడంబట్టి త్రవ్వగా నందులోనుండి ద్రవ్యము బయలుపడెను, అదిజూచి పిల్లవా డెంతయో సంతోషించి తాతకు పదే పదె సలాములు జేయుచు నేనెంతయో శ్రమపడితిని, యెందరినో యడిగితిని కాని, ఇంతటి మర్మము గ్రహించి నన్ను కృతార్థునిగా జేయకుండిరి. నేడు మీవల్ల నాకష్టము దీరెనని కొనియాడి యాద్రవ్యమూలంగా గొప్ప వ్యవహారము జేయుచు సుస్థితిలో నుండెను.

సిద్ధాంతము। అనగా! నెందరికో సంస్కృత ప్రాకృత భాషలందు జెప్పబడిన వేదాంత గ్రంథములు జదువవచ్చును అందులోని శబ్దార్థములుగూడా దెలసుకొనవచ్చును. దానిలోనుండు సంగతులు చిలుకలవత్తు పలికి చూపించజాలుదురుగాని యందలి రహస్యము గనుగొనజాలరు. దృష్టాంతములో యేవిధముగా యాముసలితాత వ్రాతయందలి మర్మమును గనుగొని బాలుని దుఃఖముదీర్చెనో, అటులే సత్పురుషులు వేదాంతములయందుండు మర్మములు కనుగొనజాలుదురు గావున, సద్గురు ముఖముగనే వేదాంత శ్రవణము జేసి సదా వారియుపదేశ వాక్యములు హృదయమందు నిలుపుకొని నిశ్చలమానసుడై యుండవలెను. కావున మనోనిశ్చలము (స్థిరము) ను గూర్చి నొక దృష్టాంతము వచించెద వినుము.

దృష్టాంతము। ఒకానొక గ్రామమందు జంగమ మతస్థుడగు లింగయ్యయు, సాతాని మతస్థుడు రంగయ్యయు నుండిరి, వీరిరువురు తమ మతములు వేరువేరగుటచే ఎల్లప్పుడు కలహించుచుందురు. ఇట్లుండ యొకనాడు రంగయ్యయను నాతడు యేదో నొక పనిగా నరసింహారావుయను కరణమువద్దకేగి లింగయ్య విషయమై మాట్లాడుచుండ నింతలో లింగయ్యకూడా నేదో యొక పనిగా యాదారిని బోవుచు పట్వారిగారివద్ద గూర్చుండియున్న రంగయ్యనుజూచి. వీడేదో నావిషయమై జెప్పుచున్నడను సంశయము గలవాడై వారి యింటిగోడ నించుక మఱుగు జేసుకొని మిడిమిడి యెండగాయుచుండ కాళ్ళు బొబ్బలెక్క

చున్నప్పటికిని లక్షింపక యారంగయ్య జెప్పు మాటలన్నియు ఏకాగ్ర
చిత్తముతో వినుచుండెను. కావున, ఎటులైతే యాలింగయ్యకు
రంగయ్య మాటలయందు మనస్సు యేకాగ్రమైయుండెనో అటువలెనే
సద్గురుడుపదేశము జేయు సమయంబున మోక్షాపేక్ష గల ముముక్షుడు
తనమనస్సును చలింపకుండా శీతోష్ణాదులును, క్షుత్పిపాసలును, మానా
వమానాదులకు సహించి సద్గురుబోధయందే మనస్సు నిలుపవలెను,
ఇంకా ఎటులనగా

అధికధనము సంపాదించవలెనను హేతువుతో నానావిధ ప్రయ
త్నములు జేయువానికి యెవరేని ధనము సంపాదించు నుపాయము
జెప్పిన నెటుల యేకాగ్ర మనస్సుతో వినుచుండునో అటులే ముముక్షు
వగు నాతడు బ్రహ్మనిష్ఠగల సద్గురుని యుపదేశ వాక్యంబుల నేకాగ్ర
మానసుడై వినవలెను. అటుల శ్రవణము జేసినపిదప నొక యేకాంత
స్థలమందుజేరి సద్గురుడు వచించిన వాక్యములన్నియు పునః పునః జ్ఞప్తికి
దెచ్చుకొని మననము జేయవలెను. అట్లు మననము జేసినచో యాబోధ
దృఢరూపమై తృప్తిగాగలదు. ఎటులనగా, బాదాంపప్పు పిస్తాపప్పు
శర్కర అన్నము మొదలగు పదార్థములు మంచిగా నమిలి తినినచో
దాని రుచి నాలుకకు వచ్చును, అట్టి పదార్థముగూడా చక్కగా జీర్ణిం
చును, అట్లు చక్కగా జీర్ణించినచో శరీరమునకు బలము నిచ్చును, అటు
వలె, సద్గురుడు వచించు వేదాంత వాక్యములను మాటిమాటికి మన
నము జేసినయెడల, అభేద తాత్పర్యమను రుచి దోచును, మరియు
నాత్మజ్ఞానమను బలము (దృఢము) నిచ్చును. ఇటుల మననము జేసినపిదప
స్వజాతీయ జ్ఞానముయొక్క ప్రవాహరూపమున్ను విజాతీయ జ్ఞానము
యొక్క తిరస్కారమున్ను నిధి ధ్యాసజేయవలెను, అట్లు చేసినచో
సరిగా ఆత్మానుభవము కాగలదు. స్వజాతీయ జ్ఞానముయొక్క ప్రవాహ
మనగా నేను సత్తును చిత్తును ఆనందమును కూటస్థుడను అక్రియు
డను అజరుడను అమరుడను పూర్ణుడను నిత్యుడను శుద్ధుడను
బుద్ధుడను ముక్తుడను ఆత్మనై యున్నాను యీప్రకారము జ్ఞానవృత్తి
యొక్క ప్రవాహము యిక విజాతీయ జ్ఞానము యొక్క తిరస్కార

మనగా నేను బ్రాహ్మణుడను క్షత్రియుడను వైశ్యుడను శూద్రుడను బ్రహ్మచారిని గృహస్థుడను సన్యాసిని అటులే నేను పురుషుడను స్త్రీని బాలుడను యౌవ్వనుడను వృద్ధుడను సుఖిని కర్తను భోక్తను అని యిటుల యేదైతె నమ్మునో యీవృత్తియొక్క తిరస్కారము జేయువలెను. (యీవృత్తినే దేహాధ్యాసమందురు) పైజెప్పిన ప్రకారముగా నోకుమారా నీవు శ్రవణమనన నిధిధ్యాసలు జేసితివేని, నిర్వికారశుద్ధ బ్రహ్మమును దర్శింపజాలుదువు. కావున, నీవింతకు లోగా జననమరణము లెట్లుదొలగునని విచారించి యుంటివిగాని, బంధనమననేది, దానిరూపమెట్లుండును, అది నీకు మొదలే దెలసియుండిన, దానినుండి దొలగు నుపాయము జేయుదురుగాని బంధనమననేదియో నీకు దెలియదు. దానినుండి దొలగు నుపాయ మెట్లు గ్రహింపజాలుదువు. ఎటులనగా, రోగమును గుర్తించక ఔషధ మెట్లివ్వనగును, అటులే నీవు బంధనమన నెద్దియో దెలసికొంటివా లేదా.

శిష్యు॥ బంధమననేదో దాని స్వరూపమెట్టిదో నాకెంతమాత్రము దెలియదు నాపై యనురాగంబుంచి దెల్పగోరెద.

గురు॥ నేను దేహమును యీదేహాదికములు నావని భావించడమే బంధము. యీ అహంకార మమకారములు అజ్ఞానమువల్ల గలిగినవి. యీదేహము నాదిగాదు దేహాదికములు నాకంటె వేరుగా నున్నవని దెలసికొనుటే బంధమోక్షము. యిదియే మోక్షమునకు మూలము.

శిష్యు॥ ఈయహంకార మమకారములెట్లు నివృత్తియగును.

గురు॥ సాధనయోగమువల్ల అహంకార మమకారములు నివృత్తియగును:

శిష్యు॥ గురువర్యా! ఇది గొప్ప ఆశ్చర్యకరముగా దోచుచున్నది ఎటులన నేను నాదియను అహంకార మమకారములు ప్రతివిషయమందుండియే యున్నవి. ఇవి యెప్పటికిని దొలగునట్లుగా దోచవు చూడండి? సాధన పురుషులెల్లరు తమ విషయమందు, నేను త్యాగిని నేను భోగిని నేను యోగిని నేను విరక్తిని. అని నుడువుచుందురు మరియు నాయాశ్రమము నాకౌపీనము నాకమండలము నాగురువు

నాశిష్యుడు. అని నుడువుటచే ప్రతి విషయములందు అహంకార మమకారములే యుండునా, ఇందుకు తాము వ్యతిరిక్తముగా జెప్పుచున్నారు. సాధనయోగమువల్ల అహంకార మమకారములు దొలుగునంటిరే, అది యెటులో దయజేసి వర్ణించ గోరువాడను.

గురు॥ దేహాది అహంకార మమకారము దొలిగే విషయమైన సాధనములు నీవు వచించినవాటిలో నొక్కటిగూడా కాదు. ఎటులన, ఆత్మానాత్మ వివేకము లేక యీసాధనములు అహంకార మమకారముల వృద్ధిజేయునేకాని నివృత్తి జేయజాలవు. ఎందుకనగా, యేజాతివానికాజాత్యభిమానము మొదలే గలిగియుండును, ఇట్లుండ అవివేకముచేత యేదైనా నొక మతము బూని యామతానుసారము వేషము వేసిన యెడల, యావేషాభిమానము నిదివరకున్న జాత్యభిమానమునకు బలమిచ్చుటచే మెండగును, మరియు నొక గృహస్థునికి సాధుసేవ జేయవలయునని యిచ్ఛగలిగి సర్వము పరిత్యజించును, అటుపిమ్మట, నేను త్యాగిని, నన్ను సర్వజనులు నమ్రభావనతో జూచెదరు, నన్ను గొప్పగా నెంచెదరని యిటుల అవివేకాభిమాన మతనికి హెచ్చుచునే యుండును. అట్టి సమయమందెవరైన నొకరు సద్విద్యోపదేశము జేసినయెడల, నేను త్యాగిని నాకెందులకీ యుపదేశంబనియే యెంచును. ఎటులన.

దృష్టాంతము॥ ఒక యింటిలో నొక ముసలమ్మ యుండెను. ఇటులుండ నొకనాడామె యింటివాకిట నొక పిల్లి చచ్చియుండెను, అది జూచి యాముసలమ్మ చాలా అసహ్యపడి యాపిల్లిని నొక తట్టలో నిడుకొని వూరివెలుపల పారవేయుటకై వెళ్ళియుండెను, అటులా పిల్లిని పారవేసి యింటికి వచ్చు సరికి, ఒక లొటిపిట మహారోగముతో నరుదెంచి యాపిల్లి జచ్చిన స్థలమందే మృతినొంది పడియుండెను. అప్పుడాముసలమ్మ యాలొటిపిట శవమునుజూచి, ఇదేమి కర్మము, పిల్లిని మాత్రము నేను తీసివేయ జాలితిని యీ లొటిపిట నెట్లు తీసివేయుదునని చింతించెను.

సిద్ధాంతము॥ ఈప్రకారముగా విచార వివేకములేక పిల్లియను మమకారమును నేను తీసివేయు దున్నానను అభిమానమువల్ల లొటిపిట

వచ్చి చేరినట్లు అభిమాన సాధన లెన్నిజేసినను అహంకార మమ
కారము లెచ్చుచుండును. కావున కేవల రూపముచే అనధికారియై
సద్గురు శరణుజొచ్చిన అహంకార మమకారములు నశించునుగాని
కేవలము వేషభాషలవల్ల నశింపవు.

శిష్యు: స్వామీ! ఏసాధనములవల్ల అహంకార మమకారములు
నశించునో కరుణించి దెల్పగలందులకు గోరుచున్నాడను.

గురు: వివేకాది సాధన సంపన్నుడైన బ్రహ్మనిష్ఠగల సద్గురుని
శరణుజొచ్చి వారి యుపదేశమువల్ల గల్గు ఆత్మ విచార జ్ఞానముచేత
అహంకార మమకారములు నశించును ఆత్మవిచారమనగా దేహము
పంచభూతములచే గలిగినది కాబట్టి, అనాత్మయనదగును ఇది దృశ్యమై
యున్నది దేహముయొక్క ద్రష్టయగు ఆత్మ వేరుగానున్నది. దేహము
జడము. ఆత్మ చైతన్యము. దేహము వికారయుక్తమై యున్నది ఆత్మ
నిర్వికారమైయున్నది దేహము క్రియాసంగమలినమైనది ఆత్మ నిష్క్రి-
యనిస్సంగ నిర్మలమైనది. ఆత్మ దేహముగాదు. దేహ మాత్మగాదు.
దేహముకొరకు నిర్ణయమైన బ్రాహ్మణాది చాతుర్వర్ణములు బ్రహ్మ
చర్యాది నాలుగు ఆశ్రమములు బాల యవ్వన వృద్ధాది వయోభేద
ములు మొదలగునవి ఆత్మవికావు అను యీవిచారముచే అహంకార
మమకారములు నశించును, బ్రహ్మ విష్ణు మహేశ్వరాది నామములు
కూడా శరీరమున కేర్పడినవేకాని ఆత్మకు గాదు, దేహముకంటె ఆత్మ
వేరని జీవుడు తెలసుకోజాలడు. అందువల్ల దేహముకొరకు కల్పింప
బడిన నామములన్ని నావేయని భావించును. కావున, ఇది వివేక విచార
యుక్తితో నివృత్తిజేయవలెను, ఎటులన, నీవెవరని మెవరైన విచారిం
చినచో నేను రాముడనని చెప్పదువు. యీరాముడను పేరు నీదేహ
మునకు కల్పింపబడినది. అనగా, నీవు జన్మించిన ౧౨ లేక ౨౧ దినమున
కీపేరు వచ్చెనేకాని, నీజన్మించినతోడనే రాముడు జన్మించెనని మెవరు
జెప్పరు ఇక నిన్నెవరైన నేను రాముడననుచుంటివే, ఈ నీదేహములో
రాముడెక్కడనుండెనని విచారించిన నీవు చూపజాలవు, ఒకవేళ నీశరీర
మును జూపించిన, అది రాముడెట్లగును. దానిని శరీరమనుచుంటిమి.

శరీరమంతట అవయవములకు, చెవులు ముక్కు కనులు చేతులు కాళ్ళు యిటుల వేరు వేరుగా వాటికి నామములుగలవు నీవు రాముడనని యెట్లు చూపించగలవు. చూపజాలకున్న దేహముకంటె వేరుగానున్న ఆత్మనని యెట్లు జెప్పగలవు, ఆత్మయని జెప్పెదమన్న, జన్మించినపుడే రాముడని పిలువవలెను. కాని జన్మించినపిదప ౧౨-౨౧ దినమున రాముడని పిలచిరి యిట్లుండ నేను రాముడనని యెట్లు సిద్ధముజేయగలవు.

శిష్యు! నేను దేహముకంటె వేరునుంటినని నాకెట్లు తెలియునో దయజేసి నాకు స్పష్టముగా దెలియునటుల వచింప వేడువాడను.

గురు! శిష్యా! ఇందులకొక దృష్టాంతము దెల్పెద వినుము. ఎటులైతే గృహము ఖంబములు కిడికీలు ద్వారములుండి యిటికెలు రాళ్ళు సున్నముతో గట్టినదై యుండును పైన కప్పుయుండును ఇట్టి గృహమందుండు మనుష్యుడుగృహమేగాక, గృహమునకు వేరుగానుండును అయిన నెవరైన నీగృహ మెవరిదనియడిగినచో నాదని వచించునేగాని గృహ మే నేనని వచింపడు అటువలె దేహముగూడా గృహమువంటిదే. ఎటులన, ఖంబములనునవి చేతులు కాళ్ళు కిడికీలను నవి చెవులు ముక్కు ద్వారమను నది నోరు ఇటికెలు రాళ్ళు సున్నము మొదలగునవి అస్తులు మాంసము కప్పుయనునది శిరము, ఎటులైతే గృహముకు యెర్రగ తెల్లగ నల్లగ రంగులుండునో అటులే దేహముయొక్క చర్మముపై వేరు వేరుగా వర్ణములుండును. ఇటుల దేహరూపమగు గృహముయొక్క యధికారివగు ఆత్మవు కాబట్టి నీవు దేహమువుకావు. దేహముకంటె వేరుగా నున్నావు. ఇందులకై పైజెప్పిన విచార సరణి మరువకుండ ధ్యానముంచితి వేని నేను దేహమునను అభిమానము నశించును. ఇదిగాక వేరే యుపాయము వల్ల నశింపజాలదు.

మంచిది, పూర్వజన్మమున జేసిన కర్మఫల మీజన్మమున అనుభవించుచున్నాననియు, యీజన్మమందు జేసిన కర్మఫలము రాబోవు జన్మమందనుభవింపగలననియు నీవనుచుంటివిగదా! అయిన మరల విచారణ జేసి చూడుము. ఎటులనగా! యీ స్థూలదేహము యిప్పుడున్నదై యిది పూర్వజన్మమందున్నదిగాక తల్లి గర్భమందు క్రొత్తగా జన్మించినదై

యున్నది. కర్మ లొనర్చువాడవగు నీవే యైయుండినయెడల పూర్వజన్మ మందు నీవే దేహముకంటె వేరుగా నున్నావని నిక్కముగా జెప్పనగును. ఎందుకనగా, దేహము నశించినపిమ్మట దేహమైతె నుండజాలదు. నీవు దేహముచే జేయబడు కర్మలయొక్క భోక్తవై దేహముకంటె వేరుగా నున్నావని సిద్ధమగుటచే, యీ స్థూలదేహము ఆత్మగాదని నేననునది నీకు అనుభవమయ్యెనా లేదా? మరియు నింకొకవిధముగా వచించెద వినుము. నాదేహము నాచేతులు నాకాళ్లు నాశిరము నాకడుపు నాచెవులని నీవు వచించుచుంటివిగాని, దానికి బదులు నేనే దేహము నేనే చేతులు నేనే కాళ్ళు నేనే శిరమని ఎంతమాత్ర మనకుంటివి. కాబట్టి నాదేహము నాచేతులను వారెవరో స్వయముగా యీదేహమందు వేరుగానున్నాడని సిద్ధమగుచున్నది.

శిష్యు! గురువర్యా మీరు వచించినటుల విచారణజేయగా నేను దేహమునుగానని స్పష్టముగా దెలియుచున్నది. యీ అనుభవమువల్ల అహంకారము నశించునుగాని దేహము నాదను మమకారము మాత్ర ముండి యేతీరును పైన వచించు దృష్టాంతములో గృహస్థుడు నేనే గృహమునని చెప్పలేదుకాని, గృహము నాదని చెప్పుటవల్ల మమత్వ మున్నటులే దోచుచున్నది, అటువలె నేను శరీరముగాదని దెలసినప్పటికిన్ని నాదేహమని చెప్పవలసివచ్చును, ఇందులో మమత్వము సిద్ధమగుచున్నది కావున యీమమత్వ మెట్లునశించునో వచింపవేడెదను.

గురు! శిష్యా! దేహము నీదిగానిది ముమ్మాటికి నిజము. ఎటులన, దేహము పంచభూతములవల్ల గలిగినది. ఇట్లుండ, నాదియని నీవనుట నిండా అజ్ఞానము. ఘటము మంటిదైయుండ, నీవు నాదని వచించుట యెంత అజ్ఞానమో నీవే యోచించుము. కట్టెలు రాళ్ళు సున్నము మన్ను మొదలగునవి మంటివైయుండ గృహము నాదనుట యెంత భ్రమగానున్నదో అటులే మాంసము రక్తము నరములు ఎముకలు మొదలగు వాటిచే నిండియున్న యీదేహము పంచభూతములదైయుండ నీవు నాదనుచుంటివి, ఇది గొప్ప తప్పు. చర్మము మాంసము ఎముకలు, యీ మొదలగునవి యుత్తమ పురుషుడు నావని చెప్పుట కహస్య

పడునేకాని నావనియనుట కొప్పదు, కావున నీవు కేవల భ్రమవల్ల నాదినాదని బలుకుచుంటివి, యిదియే నీకు బంధకారణము. ఒకే యీదేహము పంచభూతములదని స్పష్టముగా దెలియుచుండ నీవేమో నాదియని యనుచున్నావు, ఇందువల్ల నిజముగా పంచభూతములు నిన్ను దుఃఖ సాగరమున ద్రోయుచున్నవి, యీ అశాశ్వత దేహము పంచమహా భూతములదని జగమంత గర్జించుచుండగా, నీవు దేహము నాదను మమతలోబడితివేని నిన్నా పంచభూతములు ముంచివేయును. కారణమేమన, లోకములో నెవరైన పరుల సొమ్మును నాదని తలంపవద్దని చెప్పియుండిరి గాన, నీవీ పంచభూతముల సొమ్మగు దేహముపై మమత నుంచవద్దు యిందునుగూర్చి యొక దృష్టాంతము దెల్పెద వినుము.

దృష్టాంతము॥ ఒక గృహస్థు డొకదినము తన మనసులో ధర్మకార్య మేదైన భాగవత సప్తాహ లేక, హరికీర్తన వేదపారాయణ బ్రాహ్మణ భోజన మిందులో నొకటేదైన జేయవలయునని తలంచెను. గావున అతడుండుచోటు చిన్నదిగాయున్నందున యీ ధర్మకార్యమేదైన నొక భావ్య ప్రదేశమునందు జేసిన బాగుండునని సర్వజనాధికారము క్రింద నొక ప్రశస్త ప్రదేశము యుండగ నది తన ధర్మకార్యమును గూర్చి కొన్ని రోజులవర కుండుటకు అధికారులచే సెలవుపొంది కుటుంబ సహితముగా నాభావ్య ప్రదేశమునకుపోయి చేరెను. పిమ్మట నది భవ్య ప్రదేశమగుటచే అతనికి వైభవముగా దోచినందువల్ల తాను దలపెట్టిన కార్యమును మరచి వైభవము లనుభవించుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడచినతర్వాత, నాసర్వజనాధికారి యీగృహస్థుని కిచ్చిన సెలవు దినములయిపోయినందున తక్షణమే ఖాలీజేసి వెళ్ళవలసినదని తన నౌకరును పంపెను, అప్పుడా గృహస్థుడు వైభవమత్తుచే వారి మాటలందు లక్ష్యముంచకపోయెను. అటుపిమ్మట సర్వజను లొకచోట జేరి యాలోచించి యాగృహస్థుని బిలువనంపిరి, అప్పుడా గృహస్థుడు నన్ను బిలిచే కారణమేమి, యీచోటును గూర్చియేకదా, ఇప్పుడీచోటు నాదైయున్నది యిక మీదేమో మీరాలోచించండి నన్ను బిలిచే కారణమేమిలేదని చెప్పెను. ఆమాటవిన్న సర్వజనులు గృహస్థుడిపుడు

వైభవముతోను న్నాడు కొన్ని దినములతర్వాత పోగలడు కానిండనిరి ఇటుల చాలా కాలము గడిచెను గృహస్థు డేమివిచారము జేసినవాడు గాడయ్యెను అంత యాసర్వజను లాలోచనజేసి తుదకు సర్కారులో దావాచేసిరి, అప్పుడా సర్కారువారి యాజ్ఞచే భటులువెళ్ళి యాగృహస్థుని దర్బారులో కీడ్చుకొని తెచ్చిరి. అంత న్యాయాధిపతి వాది వారిని విచారించగా, అయ్యా! యీగృహస్థుడు ధర్మ కార్యమును గూర్చి మాచోటును కొన్ని దినంబులవర కిమ్మని యిప్పుడు నాదనుచున్నాడని చెప్పిరి, అంత యాప్రతివాదియగు గృహస్థుంజూచి నీవాస్థలము వీరి కెందుకు ఇవ్వవన, అందుల కాగృహస్థుడు ఇది నాస్వంత ప్రదేశము కాబట్టి నేవదలుట లేదనెను అంత న్యాయాధిపతి అటులైన యీస్థలము నీదనునట్లు కవాలాపత్రములు చూపుమన, ఆగృహస్థుడు పిరికి పిరికి మాటలు మాట్లాడజొచ్చెను. వాని మాటలే వానికి దెలియకుండెను. నిజము దాగదుగదా! అప్పుడా న్యాయాధిపతి వానింజూచి ఒరే నీ జాగనుగూర్చి కవాలా పత్రములు దెచ్చువరకు నిన్ను ఖైదులో నుంచెదమని శిక్ష విధించెను.

సిద్ధాంతము॥ జీవరూపుడగు గృహస్థుడు మోక్షము సంపాదించవలెనను యిచ్ఛగలిగి పంచమహా భూతములనుండి మనుష్యదేహమను భావ్యప్రదేశమును అడిగి తీసుకొని యందులో ప్రవేశించి విషయాసక్తియను వైభవముచే తనకార్యమును మరచెను అట్లు మరచినదేగాక పంచభూతములనుండి దీసుకున్నచోటు నాదేయనుచుండెను అప్పుడా పంచభూతము లెన్నియోసార్లు వేదాంతశాస్త్రముల ద్వారా మాచోటు మాకిమ్మని చెప్పిపంపిరిగాని జీవుడు మమత్వముచే యాశాస్త్రవాక్కుల యందు లక్ష్యముంచక పోయెను ఎటులన

క॥ మంచివచనములువిషమగు। మించినకోపంబువచ్చు మిక్కిలిపగసాధించెదరుబుధులపల్కుల। మంచివియని దెలియ లేరు మందాత్ములొగిన్॥

ప్రపంచమందు భగవద్భక్తులలో లేక బ్రహ్మనిష్ఠాపరులలో దయగల మానసులై నాయనా! నీవు వేదాంత శ్రవణము జేయుము భగవంతుని స్మరింపుము వృధా కాలము గడుపకుము యీదేహము

శాశ్వతమని నమ్మకుము ఇది నీదిగాదు కాబట్టి నిన్ను మోసగించును కావున నామాటలు నమ్మి దైవమందు యిచ్ఛగలవాడవై యుండుమని చెప్పగా వినుచు యీదొంగబుద్ధి గల జీవుడు లోలోన కసరుకొని కుచ్ఛితభావము గలవాడై పైకిజూడ అయ్యా! నేనేమిచేయుదును నాకు వేళ చిక్కదు అనేక పనులు జేయవలసియున్నవి పిల్లలవల్ల నొక్క క్షణమైన మనసు నిల్వదు గృహకృత్యములే దీరకుండును యెటుబోవుదమన్న యింటిలో నొక్కతె యుండును ఇటు లెన్నియో గొణుగుచుండునుగాని మంచిమాటలు విననొల్లరు పైకిజూడ వినినట్టు నటించువారు కొందరు యీవాళ్ళగాదురేపు రేపుగా దెల్లుండని జీవితమంతయు వ్యర్థము జేయుచు విషయాలోలురై యుండగా పంచభూతములు యీవాళ్ళగాదురేపు రేపుగా దెల్లుండి మాచోటు మాకిచ్చునని చూచిచూచి తుదకు యమధర్మరాజువద్ద ఫిర్యాదుచేసిరి, అప్పుడా యముండు భటులనంప వారాజీవుని రాజు బిల్చుచున్నాడు రమ్మన యామాటలు, విననంతనే గుండె జల్లుమని భార్యా బిడ్డలజూచి యేడ్వసాగెనేగాని, యిప్పుడు నాకు రాదీరదు యింటిలో పనులు చాలా యున్నవి పిల్లలకన్నము దినుపించువారులేరు నేనువచ్చినచో యింట్లో నొక్కతే యుండును కాబట్టి నాకు రాకడగాదని చెప్పుటకుగూడా వీలుగాకుండెను, అప్పుడా యమభటులు ఖడ్గపాశధారులై భీకరాకారులై యాజీవుని చుట్టుముట్టడించి పాశములను జుట్టి పట్టి కల్వర మొంద ప్రాణంబులంబెకలించి యా తనదేహమందు జేర్చి మంచుకొండలు అగ్నిపర్వతములు రాళ్ళు గుట్టలు ముండ్లు తేళ్ళు పాములు బెనగొను మార్గములగుండా నొడలెల్ల నెత్తురులుగార కుయ్యో మొర్రోయని కూతలిడగ జరజరనీడ్చుకొని వచ్చి యముని చరణ సన్నిధానమందు బడద్రోయ ఆయమధర్మరాజు వీరి దావానుగూర్చి నిట్లు విచారించెను.

పంచభూత! మహారాజా! యీజీవుడు మోక్షసంపాదనమను ధర్మకార్యమునుగూర్చి మావద్దనుంచి మోక్షసాధకమగు దేహము కొద్దిరోజులకొరకే దీసుకొనెను తీసుకున్న ప్రకారము మోక్షసాధనము జేయక వృధా కాలము గడుపుచుండినదేగాక మా దేహమునకు తానే

యధికారిననుచుండెను కావున మా దేహము మాకిప్పించగోరెదము.

యము॥ ఒరే! యీ పంచమహాభూతములయొక్క దేహము ఎందులకై యివ్వననుచుంటివి వారిది వారికిచ్చి వేయుము.

జీవు॥ మహారాజా! దేహము నాది ఇందులో నెంతమాత్రము సందేహములేదు యీపంచమహాభూతములు నిష్కారణముగా తమదనుచున్నారే కాని వారి దెంతమాత్రముగాదు.

యము॥ పంచమహాభూతములారా! యీ దేహము మీ దెట్లగును ఇందులకేమైన సాక్ష్యము జూపగలరా.

పంచ॥ ప్రభో! సాక్ష్యములకేమికొదువా ఇదో వినుడు యీ జీవుని స్థూల సూక్ష్మదేహములు మావనుటకు నాల్గు వేదంబులు ఆరు శాస్త్రములు పదునెనిమిది పురాణములు సమస్త ధర్మశాస్త్రములు తత్వశాస్త్రములు సాక్ష్యములు.

యము॥ జీవా! అటువలె నీవద్ద నేమైన సాక్ష్యముగలదా?

జీవు॥ (ఏమిదోచక భయపడుచుండును)

యము॥ ఒరే! ఇందుకు నీవాధారము జూపువరకు మాయొక్క నరకకూపమందు నిన్ను ఖైదుగా నుంచెదము అని నరకమను ఖైదులో వేసెను అటు పిమ్మట ఎనుబదినాలుగులక్షల మోనులందు బడియుండును,

కాబట్టి పంచమహా భూతముల దేహము వారికివ్వనిది ఖైదు నుండి వెడలజాలడు కావున శిష్యా! యీ దేహము పంచభూతములదే యగు, నీదని యెప్పటికి దలచకుము ఎవరిది వారికివ్వవలసినదేగాని నాదని యన్నచో ప్రమాదము వాటిల్లును యిక నెన్నటికిని దేహముపై మమకారముంచకుము.

శిష్యు॥ గురువర్యా! ఇప్పుడు తమ బోధవల్ల యీ దేహము నాదు పంచమహాభూతములదని స్పష్టముగా దెలసియుండెను కాని పంచభూతములన నేమి వారెవరో నాకు తోచకుండెను దయజేసి వచింపవేడెద.

గురు॥ శిష్యా! ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి యివియే పంచమహాభూతములు.

శిష్యు॥ గురువరా! యీ పంచమహాభూతములభాగ మీ దేహ

మందెట్లుండెనో గోచరము గాకుండెను.

గురు॥ ఒరే నాయనా! చక్కగా విచారము జేసిన యెడల గోచరమగును యీదేహమందుండు కఠినభాగంబంతయు పృథివితత్వంబనియు రసభాగంబంతయు జలముదనియు ఉష్ణభాగంబంతయు అగ్నిదనియు కదలుట మెదలుట మొదలగునది వాయువుదనియు జరళముగా (రిక్తము) నుండునది ఆకాశముదనియు తెలియదగినది.

శిష్యు॥ ఈదేహము పంచమహాభూతములదని సంక్షిప్తముగా నుడివితిరి కాబట్టి పంచభూతములదగు యీ శరీరమందుండు యావత్తత్వములయొక్క వివరము విపులముగాజెప్పి నాసందేహము దీర్చెదరని నమ్మెదను.

గురు॥ నాయనా! ఇదోవినుము యీపంచమహా భూతములొక్కొకటి మిగత నాల్గు భూతములను గలసి యిరువై అయిదు తత్వములయ్యెను కాబట్టి యీస్థూలదేహ పంచీకరణ కోష్టము యీదిగువనుదహరించిన ప్రకారం గ్రహించుము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశము | కామ | క్రోధ | లోభ | మోహ | మదమత్స |
| వాయువు | చలనం | గమనం | తీవ్రం | లజ్జ | భయం |
| అగ్ని | క్షుత్తు | పిపాస | నిద్ర | ఆలస్యం | సంగమం |
| జలము | రక్తము | మూత్రం | శుక్లం | శ్లేష్మము | మెదడు |
| పృథివి | అస్థి | చర్మము | మాంసము | నరములు | రోమములు |

ఆకాశము॥ ఆకాశమువల్ల అయిదుతత్వములు గల్గెను వాటిపేళ్ళు కామ క్రోధ లోభ మోహ మద మత్సరములు ఇవియన్నియు హృదయాకాశమందు బుట్టుచున్నవి కాబట్టి ఆకాశతత్వము లనబడును వీటిని నీవు విచారముచే కనుగొనజాలుదువు గావున వీటికి నీవు సాక్షిగా నున్నావు అనగా, చూచుచున్నావు కాబట్టి యీతత్వములు బంధద్వారములుగా అత్యంత దుఃఖము లొసంగునని ఎల్లరకు దెలిసి చేయున్నది

కావున ఇది నీవు విచారముచే త్యజించవలయును ఎందుకనగా, కామ మందాసక్తుడగుటచే రావణుండత్యంత దుఃఖముల పాలయ్యెను.

క్రోధమనునది రాక్షసులకంటె మహా ఘాతకి ఎందుకనగా రాక్షసులు యితరుల రక్తమును త్రాగుదురుగాని, క్రోధముగల మనుష్యుడు తనదేగాక యితరుల రక్తముగూడా త్రాగును. రాక్షసులు రాత్రికాలములయం దితరుల బాధింతురు కాని క్రోధము రాతిరింబవలు బాధించుచుండును, రాక్షసు లితరుల భయపెట్టుదురుగాని క్రోధము తాను భయపడి యితరుల భయపెట్టును, కాబట్టి క్రోధముగల మనుష్యుని రాక్షసునికంటె నీచముగా భావింతురు అందువల్ల క్రోధమును బొత్తిగా కాల్చివేయవలెను, లోభమువల్ల దుర్యోధనాదులు మరణించిరి మోహమువల్ల దశరథమహారాజు మరణించెను మదమత్సరములవల్ల శిశుపాల దంతవక్త్రులు మొదలగువారు నశించిరి ఇక యీతత్వములన్నియు విడచిపెట్టవలయును వీటియం దెంతమాత్రము అహంకార మమకారము లుంచగూడదు యీ కామాది పంచతత్వములు సూక్ష్మదేహ ధర్మములైనప్పటికిని స్థూలదేహమందున్నట్లు స్పష్టముగా గనుపించుచున్నవి అందువల్ల స్థూలదేహమందు వర్ణింపబడినవి.

వాయువు! వాయువువల్ల అయిదుతత్వములు గలిగెను చలనము, గమనము, తీవ్రము, లజ్జ, భయము, యీ అయిదుతత్వములు వాయుతత్వములేగాని నీవిగావు. ఎటులన, వాయువుగాక చలనాదిక్రియలు జరుగజాలవు కాబట్టి వీటినన్నిటిని నీవు గుర్తించుచున్నావు సాక్షివైయున్నావు.

అగ్ని! అగ్నివల్ల అయిదు తత్వములు గలిగెను. క్షుత్తు, పిపాస, నిద్ర, ఆలస్యము, సంగమము, యీ అయిదుతత్వములు అగ్నివల్ల గలిగినవని తనంతటనే స్పష్టమగుచున్నవి ఎటులన అగ్ని ప్రబలముగానిదే అన్నము జీర్ణించదు ఆకలి గల్గదు ఉష్ణత హెచ్చుగానిదే దాహము గల్గదు యీతత్వము లగ్నివని చెప్పటలో నేమాత్రము సందేహములేదు.

జలము! జలమువల్ల రక్తము మూత్రము శుక్లము శ్లేష్మము మెదడు యీ అయిదుతత్వములు జలమువల్ల గల్గినవని స్పష్టముగా

దెలియుచున్నవి ఎట్లన నీళ్ళు ద్రాగక మూత్రము రాజాలదు యిందువల్ల యివన్నియు జలమువల్ల బుట్టినవని తెలియవలెను.

పృథివి॥ పృథివితత్వములు అస్థి చర్మము మాంసము నరములు రోమములు యీ అయిదుతత్వములు పృథివివల్ల జన్మించినవని స్పష్టముగా దెలియుచున్నవి ఎట్లన దేహమునుండి జీవుడు వెళ్ళినతర్వాత ఆకాశవాయు వగ్నిజలములను యీనాలుగు భూతములవల్ల గల్గిన కామక్రోధాది విభాగములన్నియు ఆకాశాది భూతములందు గలసిపోవును ఇది స్పష్టముగా దెలియుచున్నది యిక శవమందు పృథివియొక్క విభాగతత్వములే యుండును ఇవిగూడా పీనుగను కాల్చి లేక మన్నులో పూడ్చినచో మన్నుయం దాశవము లయించును యిందులకై యీ తత్వములు నీవి కావు వీటికి నీవు సాక్షివై యున్నావు కావున యీయిరువదియైదు తత్వములవల్ల నీస్థూలదేహమయ్యెను యిదియంతయు పంచీకృత పంచమహాభూతముల కార్యమైయున్నది.

శిష్యు॥ హే సద్గురో! యీ పంచమహాభూతములు ఒకదానిలో నొకటి యెట్లగలిసెనో వచింపవేడెదను.

గురు॥ ఈశ్వరేచ్ఛవల్ల మొదట ప్రతియొక భూతము రెండు భాగములయ్యెను అందొక భాగము వేరుగానుండి మిగత యర్థభాగములో మరల నాలుగు భాగములయ్యె యీ నాలుగు భాగములు మిగత నాలుగు భూతములతో గలియుటచే నైదుతత్వములయ్యెను యిటులే అయిదైదులు యిరువదియైదు తత్వములయ్యెను యీ తత్వములన్నియు నొక్కచోట గలియుటచే దీనికి స్థూలమనియందురు నిజము విచారించగా యిరువదియైదు తత్వములేగాని యిందులో దేహమనునది వేరే యొకటిలేదు యిదియంతయుభ్రమ యిందుకొక దృష్టాంతము జెప్పెద వినుము.

దృష్టాంతము॥ వివేకుడు అవివేకుడను యిరువురు గృహస్థులొక నాడొక యూరికి బోవుచు మార్గమధ్యంబున ఒక బండి వచ్చుచుండ జూచి యిట్లనుకొనిరి.

అవివే॥ అన్నా! మనము చాలాదూరము నడచి వచ్చుటచే

కాళ్ళు నొప్పులెత్తుచున్నవి కాబట్టి అదో మనకెదురుగా వచ్చుచుండెడి బండిని బాడుగకు విచారించి యెక్కిపోయినచో బాగుండును.

వివే॥ ఏమీ బండి వచ్చుచున్నదంటివే ఎక్కడ నున్నది నాకు మాత్రి మగుపడుతులేదు.

అవి॥ అదుగో చూడుము మనకెదురుగా నున్నదాని లేదనుచున్నావే నీవేమి గుడ్డివాడవా.

వివే॥ దానినే నీవు బండియనుచున్నావా అది బండికాదు.

అవి॥ నిక్కముగా అది బండియే యైయుండ నీవు కాదనినంతనే కాకపోవునా.

వివే॥ ఒకవేళ అది బండియేయని సిద్ధముగానియెడల నీకేమి శిక్ష జేయవలెను.

అవి॥ నీవనువట్లుగా అది బండిగానియెడల నీవు జేసిన శిక్ష కొప్పుకొందును (ఇంతలో బండిగూడా వీరివద్దకువచ్చి నిలిచెను) ఇదో చూడుము యిదియేబండి.

వివే॥ ఒరే యూరక బండిబండియని వదరుచుంటివేకాని బండి యనునది యేదో నీవు చక్కగా వేలుంచి చూపుము.

అవి॥ (బండియొక్క యొకభాగమందు వేలుంచి) ఇదోచూడుము.

వివే॥ అరే అది బండిగాదు దానికి కానియని యందురు.

అవి॥ అటులైన నిదో చూడుము (చక్రిముపై వేలుంచును)

వివే॥ అది బండిగాదు దానిని చక్రిమని యందురు.

అవి॥ ఇదో చూడుము (యిరుసునుజూపును)

వివే॥ దానిని యిరుసని యందురుగాని బండిగాదు.

యిటుల అవివేకు డెచ్చటెచ్చట వేలుంచి చూపినో వాటి వాటి కున్న పేళ్ళను జెప్పుచు వివేకుడిది బండిగాదని తుదకు సిద్ధముజేసి చూపించెను అప్పుడవివేకుడు నిచ్చేష్టితుడై ఒరే బాబూ ఒరే బాబూ ఇది నిజముగా బండిగాదు ఇక నీవు జేసిన శిక్షకు ఒప్పుకుందుననెను.

సిద్ధాంము॥ అటులే దీనికి దేహమనెడు నామముగూడా వ్యవహార నిమిత్యము కల్పించినదేగాని నిజము విచారించిన దేహముగాదని

సిద్ధమగును అందువల్ల అహంకార మమకారములుగూడా నుండజాలవు ఇక నెప్పటికిని దేహముపై అహంకార మమకారములుంచకుము అట్లుంచకుండినచో మోక్షము లభించును మరియు నీస్థూలదేహమును అన్నమయకోశమనిగూడా వర్ణించియుండిరి కాబట్టి యీ అన్నమయకోశము కంటె ఆత్మ వేరుగానున్నదని తెలియవలెను.

శిష్యు॥ స్వామీ స్థూలదేహమును అన్నమయకోశమని ఏలందురో వచింపగలందులకు ప్రార్థన.

గురు॥ జీవుని యొక్క తలిదండ్రులు భుజించునట్టి అన్నరసమువల్ల వారి శరీరమందు రక్తవీర్యము లుత్పన్నమై ఆరక్తవీర్యముల సంయోగమున జీవునియొక్క స్థూలదేహ ముత్పన్నమగును జీవుడు జన్మించిన పిమ్మటగూడా తల్లి భుజించినఅన్నముయొక్క పరిణామమను క్షీరములు స్తనములందుత్పన్నమగును ఆక్షీరములు త్రాగుటచే జీవునియొక్క స్థూలదేహము వర్ధిల్లును మరియు దంతము వచ్చినతదుపరి అన్నమును భుజించుటచే జీవునియొక్క దేహము పెరుగును ఇదిగాక యీ ప్రత్యేక స్థూలదేహమే యితర జీవులయొక్క అన్నరూప భక్ష్యమైయుండెను మరియు అన్నము దినకున్నచో స్థూలదేహము పెరుగజాలదు జీవుడు వెళ్ళినపిదప అన్నరూపముగానే పృథివిలో లయమౌను కాబట్టి ఇన్ని కారణములవల్ల స్థూలదేహమును అన్నమయకోశమందురు ఎటులైతే ద్రవ్యమును దాచిపెట్టు కొరడీని కోశమనియందురో అటులే అన్నమయ శరీరము ఆత్మను కప్పుకొనియుండుటచే దేహమును గూడా అన్నమయ కోశమని యందురు కాబట్టి అన్నమయ కోశముకంటె ఆత్మ వేరుగానున్నదని ముముక్షుడు గురునివద్ద దెలసుకొని స్థూలదేహముపైని అహంకారమమకారములు త్యజింపవలెను స్థూలదేహమునకు జాగ్రదావస్థాది తత్వములింకా మెనిమిదిగలవు వాటి నామము లీక్రింది విధముగానున్నవి.

| జ్ఞానేంద్రియములు | జ్ఞానేంద్రియవిషయములు | దేవతలు |
|---|---|---|
| శ్రోత్రములు | శబ్దము | దిశ |
| త్వచ | స్పర్షము | వాయువు |
| చక్షులు | రూపము | సూర్యుడు |
| జిహ్వ | రసము | వరుణుడు |
| ఘ్రాణము | గంధము | అశ్వినీకుమారులు |
| కర్మేంద్రియములు | కర్మేంద్రియవిషయములు | దేవతలు |
| వాక్కు | వచనం | అగ్ని |
| పాణి | ఆదానము | ఇంద్రుడు |
| పాదములు | గమనము | ఉపేంద్రుడు |
| గుహ్యము | ఆనందము | ప్రజాపతి |
| గుదము | విసర్గము | మృత్యువు |
| అంతఃకరణములు | వాటివిషయములు | దేవతులు |
| మనస్సు | సంకల్పము | చంద్రుడు |
| బుద్ధి | నిశ్చయము | బ్రహ్మ |
| చిత్తము | చింతనము | నారాయణుడు |
| అహంకారము | అభిమానము | రుద్రుడు |

పై జెప్పిన నలుబదిరెండు తత్వములతో ప్రతిదినము ఉదయం మెలకువజెందినది మొదలు సాయంత్రము నిద్రించు నంతవరకు యేదైతే ప్రతిమనుజునకు వ్యవహారము నడచునో అదియే జాగ్రదావస్థయందురు ఇదియంతయు నీవు గుర్తించుచుంటివి కావున దీనికి నీవు సాక్షివై యున్నావు యిక జాగ్రదావస్థాది యెనిమిది తత్వముల వివరము జెప్పచున్నాను శ్రద్ధతో వినుము.

(1) జాగ్రదావస్థ॥ జీవుడు మెలకువనుండి ఇంద్రియములవల్ల అనగా— జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతఃకరణములవల్ల వాటి శబ్దస్పర్ష

రూప రసగంధాది విషయములు యేయవస్థయందైతే స్పష్టముగా దెలియునో ఆయవస్థను జాగ్రిదావస్థయని యందురు ఇటుల ఉపనిష దాది గ్రంథములయందు జెప్పబడియున్నది జీవునికి జాగ్రిదావస్థయొక్క వ్యవహారముపై జెప్పిన చక్రిమందుండు నలుబదిరెండు తత్వములవల్ల జరుగును.

(2) నేత్రస్థానము॥ ఇది జాగ్రిదావస్థదైయున్నది ఎటులన నేత్రి ములవల్లనే జాగ్రిదావస్థలోని వ్యవహారము జరుగును.

(వైఖరీవాచ॥ ఇది జాగ్రిదావస్థయందే యుండును, (1) కంఠము (2) దవడలు (3) జిహ్వామూలము (4) దంతములు (5) పెదవులు (6) నాశికము (7) హృదయము (8) శిరము యీయెనిమిది స్థానముల వల్ల మనుష్యుడు స్పష్టముగా మాట్లాడుచుండును కావున దానిని వైఖరీ వాచయని యందురు.

(4) స్థూలభోగము॥ అనగా సుఖదుఃఖాదిభోగములైతే స్పష్ట ముగా జాగ్రిదావస్థయందగునో దానిని స్థూలభోగమందురు.

(5) క్రియాశక్తి॥ అనగా జాగ్రిదావస్థయందు శరీరములవల్ల క్రియరూపమగు వ్యవహారము ఏశక్తివల్ల జరుగునో దానిని క్రియాశక్తి యని యందురు.

(6) రజోగుణము॥ అనగా అభిమానమువల్ల రాగద్వేషాది రాజ సక్రియలు ఏగుణమువల్ల జరుగునో దానిని రజోగుణమందురు;

(7) అకారమాత్రి॥ అక్షరమును మాత్రియనియందురు ఇది జాగ్రదావస్థయందుండును.

(8) విశ్వాభిమానము॥ అనగా జాగ్రదావస్థయందు బుద్ధియందు ఆత్మయొక్క అభ్యాసము (నేను కర్తను నేను భోక్తను ఇటుల నానావిధ ముల జీవుడొనరించు అభిమానము.

ఈ తత్వములన్నియు నీవు గుర్తించుచున్నావు కాబట్టి నీవీతత్వ ములకంటే వేరుగానున్నావు యీతత్వములన్నియు జాగ్రదావస్థవేకాని నీవిగావు.

గీ॥ అన్నమయకోశమనెడుదేహంబుకిటుల ♦ వరుసమాప్పదిమూడు

తత్వంబులెల్ల ♦ దృశ్యమైయుండెనీటిని దెలియునట్టి ♦ తెలివియేనీవటంచును దెలియుశిష్యా!

స్థూలదేహమునకు జెప్పబడిన కామక్రోధాది యిరువదియైదు తత్వములున్ను మరియు జాగ్రదావస్థాది యెనిమిదితత్వములున్ను గలసి ముప్పదిమూడు తత్వములయ్యెను యీతత్వములన్నియు నీవు గుర్తించుచుంటివిగాబట్టి ద్రిష్టవైయున్నావు గాన తత్వములే నీవుగావు యీమాట ముమ్మాటికి నిజము ఇందులకై శ్రీశంకరాచార్యులు వాక్యవృత్తియను గ్రింధమంది యిటుల నుడివిరి.

శ్లో॥ ఘటద్రిష్టాఘటాద్భిన్నాః । సర్వదానఘటోయథా
దేహాద్రిష్టాతథాదేహా । నాహమిత్యవధారయేత్॥

తా॥ ఘటము ఘటమునుజూచువాడు ఘటముకంటె వేరుగానుండు విధముగా దేహముయొక్క ద్రిష్టయగు ఆత్మ ఎన్నటికి నొక్కటిగాదని మనుష్యుడు నిశ్చయించదగినది ఘటమనగా కుండయని యర్థము కుండగూడా పంచమహాభూతములవల్ల తయారగుటచే నదియెటుల జడమై దృశ్యమైయున్నదో అటులే దేహముగూడా పంచమహాభూతములవల్ల బుట్టినదగుటచే జడమై దృశ్యమైయున్నది కాబట్టి నీవు దాని ద్రిష్టవగు చైతన్యుడవు.

శిష్యు॥ గురువర్యా! ఘటము యెటులుత్పన్నమగునో యటులే యుండును కాబట్టి జడమందు రిది నిశ్చయముగాని శరీరమట్లుగాక పెరుగుచుండునుగదా యిది ఘటమువత్తు జడమెట్లగును.

గురు॥ శరీరము బెరుగుచున్నదయినంతనే చైతన్యముగాదు ఎటులైతె నిత్యము కచ్చుపై కచ్చువేయుచుండిన గోడ బెరుగుచుండునో లేక పెంటలో కసువు ప్రితిదినము వేయుటవల్ల బెరుగుచుండునో అటులే దేహమునకు ప్రతిదినము అన్నము నీళ్ళు కూరగాయలు మొదలగు కసువు పడుటవల్ల బెరుగుచుండును కాబట్టి ఎటులైతె గోడ పెంట చైతన్యముగాదో అటువలె దేహముగూడా చైతన్యముగాదు అగ్నివల్ల ఇనుము ప్రకాశించినటుల ఆత్మ సంబంధమువల్ల దేహము చైతన్యమువలె దోచునేగాని నిజముగా చైతన్యముగాదు యీప్రికారముగా

దేహము జడమైయున్నది నీవు దేహముయొక్క ద్రష్టవు దేహముకంటె వేఱుగానున్నావు ఆత్మవు చిత్స్వరూపుడవు అజరుడవు అమరుడవు నిత్యుడవై యున్నావు. శిష్యు! నేను పుట్టినవాడను కాబట్టి మరణించుట సిద్ధమై యుండగా నన్ను అజరామరుడని యనుచున్నారే నేనెట్లు అజరామరుడ నగుదునో తెలుపగోరెదను.

గురు! జన్మాది షడ్వికారములు అనగా జాయతే అస్తి తే వర్ధతే విపరిణమతే అపక్షీయతే వినాశయతే యను నీషడ్వికారములు స్థూల దేహముకే యుండునుగాని ఆత్మకు లేవు కాబట్టి ఆత్మకెప్పుడు మలిన మంటదు ఎటులనగా మన్నుతో కుండను జేయుదురు ఆకుండలోనుండు ఆకాశము కుండగాదు ఛిద్రము గల్గిన కుండకు వృద్ధత్వమయినట్లు దెలసి కొందుము పగిలినచో వినాశమయి నట్లుగా యనుకొని పారవేయుదుము కాని దానిలోనుండు ఆకాశముమాత్రము పగిలి ఛిద్రముపడినట్లు వికార మును పొందదు కుండలేనప్పుడు కుండయున్నప్పుడు కుండ పగిలి పోయి నప్పుడు యేయవస్థయందుగూడా ఆకాశము వికారమును బొందదు అటులే దేహము పుట్టిన పెరిగిన చచ్చినప్పటికిని ఆత్మ పుట్టదు పెరుగదు చావదు యెటువంటి వికారములు ఆత్మకు గలుగవు ఎటులైతె ఆకా శము నిర్వయవమైయుండెనో అటులే ఆత్మకుగూడా అవయవములు రూపములేదు కాబట్టి జన్మాది షడ్వికారములు ఆత్మకులేవు యిందుకు శ్రీకృష్ణ భగవానులు భగవద్గీతయందు రెండవ అధ్యాయములో నిట్లు చెప్పియున్నారు.

శ్లో॥ నజాయతేమ్రియతేవాకదాచి । న్నాయంభూత్వా భవితావాన భూయః । అజోనిత్యఃశాశ్వతోయం పురాణో । నహన్యతే హన్య మానేశరీరే॥

ఈ అపరోక్షరూపమగు ఆత్మ పుట్టదు చావదు యేవికారమును బొందదు అది జన్మ నిత్య శాశ్వత అవ్యయ అకలంకమైయున్నది ఆత్మ యెప్పటికిని నశించదు కావున ఓ శిష్యా! సద్గురువాక్యములందు విశ్వాస ముంచి స్వతఃనిర్వికార బ్రహ్మమునని అనుభవము బొంది నీమనస్సును దృఢపరచుకొమ్ము.

ఇటుల సద్గురుడు స్థూలదేహముకంటె ఆత్మ వేరుగానున్నదని బోధించి శిష్యుని మనస్సును నిశ్చలంజేసి విశ్వాసము గలిగించెను అంత శిష్యుడు శరీరముయొక్క మమత్వాధ్యాస నొదిలెనుగాని సూక్ష్మదేహముకంటె ఆత్మ వేరుగానున్న దెరుగక సూక్ష్మదేహమే నాదైయుండ వచ్చునను భ్రాంతితో సద్గురుందిలకించి యిట్లనియె.

గీ॥ స్థూలదేహముగానంచు సూటిగాను ♦ దెలియబడెనాకు మీయొక్క దివ్యకృపచె ♦ సూక్ష్మదేహమె నేనంచు సుస్థిరముగ ♦ మదిలో సంకల్ప ముదయించె బుధవరేణ్య॥ శిష్యు! గురువరా తమ యుపదేశమువల్ల స్థూలదేహము నాదిగాదని విశ్వాసము గలిగెనుకాని సూక్ష్మదేహమనునది నేనుగావచ్చునని తోచుచున్నది.

గురు॥ ఒరే నాయనా! సూక్ష్మదేహము నీదిగాదు (సూక్ష్మదేహమనగా లింగదేహము) సూక్ష్మదేహము నీకు దృశ్యము నీవు ద్రష్టవు కాబట్టి సూక్ష్మదేహము నీవుగావు అని యిటుల సద్గురుడు లింగదేహము నీవుగాదని చెప్పి లింగదేహాధ్యాసమునువదలుమని యుపదేశము జేసెనుగాన సంక్షిప్తముగా జెప్పుటవల్ల సంపూర్ణజ్ఞానము గల్గక లింగదేహమే ఆత్మయను భ్రాంతితో శిష్యుడిట్లనియె.

శిష్యు॥ గురువర్యా! స్థూలదేహము నాదిగాదని దృఢనిశ్చయమైనది ఎందుకనగా ఇది పంచమహాభూతములదగుటచే అత్యంత వికారముగల వీర్యరక్తములతో నుత్పన్నమైన ఎముకలు రక్తము మాంసము మలము మూత్రము కఫము మొదలగు అత్యంత అపవిత్ర దుర్గంధవస్తువులచే నిండి నవద్వారములనుండి దుర్గంధయుతమైన పదార్థములు వెలువడుచుండును మరియు మేవామిఠాయి అన్నము మొదలగు అత్యుత్తమ పదార్థములు దినుటమేకాని అవి స్థూలదేహములో ప్రవేశ పడడమే యాలస్యము వెంటనే రూపము జెడి దుర్గంధయుక్తమగు మలరూపమగును కావున చూచుటకు మాత్రము శుచిర్భూతము విచారించిన వికారముగానుండు స్థూలదేహము నేనెట్లగుదును కాను గాని వికారరూపియగు స్థూలదేహమందుండు సూక్ష్మదేహము నేనైయుండవచ్చునని నాకు దోచుచున్నది కారణమేమన సూక్ష్మదేహమువల్ల రాకలు పోకలు

మొదలగు వ్యాపారములు జరుగుచున్నవి ఎటులన చక్షురింద్రియము వల్ల చూడగల్గుచున్నాను కర్ణేంద్రియముతో వినుచున్నాను వాగింద్రియమువల్ల మాటలాడుచున్నాను కాబట్టి సూక్ష్మదేహేంద్రియముల వల్లనే స్థూలదేహ వ్యవహారము జరుగుచుండును సూక్ష్మదేహమువల్లనే స్థూలదేహము ప్రకాశము నొందుచున్నది కావున స్థూలదేహముకంటె సూక్ష్మదేహమే ప్రధానము సూక్ష్మదేహ మెంతకాలముండునో అంత వరకే స్థూలదేహముయొక్క తల్లి దండ్రి భార్య పిల్లలు మొదలగు కుటుంబ సంబంధములుండును సూక్ష్మదేహము వెళ్లినా స్థూలదేహ ముకుండే సంబంధముసన్నగిల్లును ఇన్ని కారణములవల్ల సూక్ష్మదేహము నేనని దోచుచున్నది మరియు నేను మాట్లాడెద వినెద చూచెద నాకు ఆకలి నాకు నిద్ర నేను సుఖిని నేను దుఃఖినని యివన్నియు సూక్ష్మదేహ మువద్దనే దృగ్గోచరమగును కావున సూక్ష్మదేహమే నేననిదోచుచుండెను.

గురు॥ ఒరేనాయనా! నీవు సూక్ష్మదేహమెట్లయ్యెదవు అది గూడా పంచభూతములవల్ల గల్గినదే అది జడమైయుండి దృశ్యము నీవు దానికి ద్రష్టవు కాబట్టి సూక్ష్మదేహము నీవు కావు పంచభూతములదే యగును నీవు దానికి సాక్షివైయున్నావు దీని యనుభవముకొరకు నీయొక్క విచారశక్తిచే స్థూలదేహముకంటె ఆత్మ వేరుగానున్నదని యెట్లు దెలసుకుంటివో అటులే చక్కగా విచారమొనర్చిన సూక్ష్మదేహము వేరు ఆత్మవేరని దెలియనగును. శిష్యు॥ గురువర్యా! తాము వచించిన ప్రకారము సూక్ష్మదేహముయొక్క తత్వములెన్నియో యే యే భూత మువల్ల యే యే తత్వముగగ్గైనో ఈదాసునియందు దయజేసి వక్కాణించగోరెద. గురు॥ శిష్యా! ఇదో వచించెద వినుము అంతఃకరణపంచకము ప్రాణపంచకము జ్ఞానేంద్రియపంచకము కర్మేంద్రియపంచకము విషయపంచకము ఈచొప్పున ఇరువదియైదు తత్వములు ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి ఈ పంచమహాభూతములవల్ల గలిగినవి వాటి విభాగము వేర్వేర నీక్రింద నుదహరింపబడిన కోష్టకమువల్ల దెలియనగును.

---

☞ చదువరులారా యీక్రింద నుదహరించిన సూక్ష్మదేహ కోష్టకమందు నేమైన పొరపాటులుండినచో మన్నింపగలందులకు ప్రార్థన.

## సూక్ష్మదేహ పంచీకరణ చక్రము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచ మహా భూత ములు | ఆకాశము యొక్క అంతఃకరణ పంచకము వాటి యొక్క కర్తభోక్తలు. | వాయువుయొక్క ప్రాణ పంచకము వాటియొక్క వాహనములు. | అగ్నియొక్క జ్ఞానేంద్రియపంచకము వాటియొక్క ద్వారములు. | జలము యొక్క కర్మేంద్రియ పంచకము వాటి యొక్క సేవకులు. | పృథివి యొక్క విషయ పంచకము భోగ ములు |
| ఆకాశము | అంతఃకరణము పరిధము స్ఫురణము దేవత విష్ణువు | వ్యానవాయువు సర్వాంగస్థానమందుండును దాని కర్మ సర్వదేహమును వెనుకకు ముందుకు నడిపించునట్లు జేయును. | శ్రోత్రములు దైవత దిశ దాని యోగంబున శబ్దము వినవచ్చును అది లేనియెడల జీవుని చెవిటియనియందురు. | వాక్కు దైవత అగ్ని దాని యోగంబున జీవుడు మాట్లాడుచుండును అది లేని యెడల జీవుడు వెడ్డివాడు. | శబ్దము |
| వాయువు | మనస్సు సంకల్ప వికల్పాత్మకము దీనికి దైవత చంద్రుడు దానివల్ల జీవుడు సంకల్ప వికల్పమొనర్చును. | సమానవాయువు నాభి యందుండును దాని కర్మ అన్నరసమును నాడులగుండా రోమరోమములందు ప్రవేశింపజేయును. | త్వక్ దైవతము వాయువు దానివల్ల శీతోష్ణ మృదు కఠిన యిత్యాది స్పర్శలు జీవుడు గుర్తించును. | పాణి దైవత ఇంద్రుడు దాని యోగంబున జీవుడు సర్వపదార్థముల నిచ్చును పుచ్చుకొనును అదిలేక యీ కార్యము సాగదు. | స్పర్శము |

| | | | | | |
|---|---|---|---|---|---|
| అగ్ని | బుద్ధి నిశ్చయాత్మకము దైవతె బ్రహ్మ దానియోగంబున జీవునికినిశ్చయమగును. | ఉదానవాయువు కంఠ స్థాన మందుండి అన్నరసము ను విభాగము జేయును ఎక్కిళ్ళు గలుగ జేయును స్వప్నము గలిగించును. | చక్షున్సుల దైవత సూర్యుడు వాటియోగంబునజీవుడు రూపమును జూచును అవి లేనియెడల జీవుడు గ్రుడ్డి యనియందురు | పాదములు దైవత ఉపేంద్రుడు వాటి యోగంబున జీవుడు వచ్చుచు పోవుచుండును అది లేనియెడల జీవుడు కుంటియని యందురు. | రూపము |
| జలము | చిత్తము చింతించును దైవత నారాయణుడు దాని వల్ల జీవుడు స్మరణ జేయును. | ప్రాణవాయువు హృదయస్థానమందుండును కర్మ ౨౧౬౦౦ శ్వాసోచ్ఛ్వాసము జేయుచుండును. | జిహ్వ దైవత వరుణుడు దానివల్ల జీవునకు షడ్రసములు దెలియును అది లేక దెలియజాలదు. | శిశ్నము దైవత ప్రజాపతి దానివల్ల పురుషునికి మూత్రవిసర్జనము రతిభోగము జర్గును అది లేనియెడల నపుంసకుడనియు యందురు. | రసము |
| పృథివి | అహంకారము దైవత రుద్రుడు దానివల్ల జీవునకు అహంకారము గల్గును. | అపానవాయువు గుద స్థానమం దుండును కర్మ మలవిసర్జన జేసి మరల గుదమునుమూసికొనును. | ఘ్రాణము దైవత అశ్వినీ కొమారులు దానివల్ల జీవునకు సుగంధ దుర్గంధములు దెలియును అది లేనియెడల దెలియజాలదు. | గుదము దైవత యముడు దానివల్ల మలవిసర్జనమగును. | గంధము |

తె ల స్ర ం ల జ్ఞా చా స్ర ఆ యు.

ఆకాశమువల్ల॥ అంతఃకరణము మనస్సు బుద్ధి చిత్తము అహంకారము గలిగెను దీనిని అంతఃకరణపంచకమని యందురు.

వాయువునల్ల॥ వ్యాన సమాన ఉదాన ప్రాణ అపానవాయువులు గలిగెను దీని వాయుపంచకము లేక ప్రాణపంచకమనియందురు.

అగ్నివల్ల॥ శ్రోత్రి త్వక్ చక్షు జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియ పంచకము గలిగెను.

జలమువల్ల॥ వాక్కు పాణి పాద గుహ్య గుదములుగల్గెను దీనిని కర్మేంద్రియ పంచకమని యందురు.

పృథివివల్ల॥ శబ్ద స్పర్శ రూప రస గంధములుగలిగెను దీనిని విషయ పంచకమని యందురు.

యీ తత్వములన్నియు పంచభూతములవల్ల బుట్టినవి కాబట్టి నీవి కావు నీవీతత్వములన్నియు జూచుచున్నావు కావున ద్రిష్టవు.

శిష్యః మహారాజా! యీ యిరువదియైదు తత్వములు నాకు గోచరమగుచున్నవి వాటి రూపములు గుర్తించజాలకున్నాను కావున యీ తత్వముల క్రియాస్వరూపముల దెలుపవేడెదను.

## అంతఃకరణపంచకవివరణము

అంతఃకరణము॥ అనగా— శరీరములోనుండి తనకు గల్గుచున్న జ్ఞాన సుఖాది సాధనరూపము అంతః అనగా లోన కరణమనగా గోచరింప జేయుట లేక సుర్ఫింపజేయుట దీనికి అధిదేవత విష్ణువు.

మనస్సు॥ అనగా— యేదేని యొక పనిజేయవలయునను లేక చేయ వద్దను సంకల్పము గలిగించునదే మనస్సు దీనికి అధిదేవత చంద్రుడు.

బుద్ధి॥ అనగా— మనస్సులో దోచినపనిని నిశ్చయించునది దీనికి అధి దేవత బ్రహ్మ.

చిత్తము॥ ఫలానిపని జేయవలసియున్నది యిది యెట్లు జేయవల యునని చింతించుచుండునది చిత్తము దీని కధిదేవత నారాయణుడు

అహంకారము॥ అనగా! ఫలానిపని మనము జేయుదము అని అభి మానపడుచుండునది అహంకారము దీని కధిదేవత రుద్రుడు.

అంతఃకరణము నిజముగా జూచినయెడల ఒక్కటేగాని దానిలో

సంకల్ప వికల్ప నిశ్చయాదులు వేరువేరుగా నుండుటబట్టి మనస్సు బుద్ధి చిత్తమని వేరువేరుగా నామము లివ్వబడినవి ఎటులనగా

ఒక మనుష్యుడు వంటపనులలో నుండిన యెడల వంటలవాడనియు చదువు జెప్పిన పంతులనియు మందులిచ్చుచున్న వైద్యుడనియు చెప్పదుము అటువలె అంతఃకరణాదులు నొక్కటియేయైనను వృత్తులు వేరగుటవల్ల వేరువేరుగా నామము లివ్వబడినవి వీటిని నీవు కనుగొనుచున్నావు గాన నీవు వేరు అంతఃకరణము వేరని దలంచుము.

♦ ప్రాణపంచకము ♦

వ్యానవాయువు॥ ఇది శరీరమంతటనుండి కదలునలుల మెదలునలుల జేయుచుండును.

సమానవాయువు॥ ఇది నాభిస్థానమందుండి మనుష్యుడు దినే అన్నమును త్రాగే నీరును జఠరాగ్నిలో పచనమైనతర్వాత స్థూలసూక్ష్మములను రెండు భాగములై దానిలో సూక్ష్మభాగము శరీరములో ప్రవేశింపజేసి పుష్టి కల్గించును స్థూలభాగము మలమూత్రములగును యిది వ్యానవాయువువల్ల జరుగుచుండు క్రియయని దెలియవలెను.

ఉదానవాయువు॥ ఇది కంఠస్థానమందుండి మనుష్యుడు భుజించు అన్నమును త్రాగే నీరును వేరువేరుగా భాగించి లోన ప్రవేశపజేయును.

ప్రాణవాయువు॥ ఇది హృదయస్థానమందుండి రాత్రింబవలు నెడతెగక దినమొక్కంటికి ౨౧౬౦౦ శ్వాసోచ్ఛ్వాసములు గలిగింపుచుండును.

అపానవాయువు॥ ఇది గుదస్థానమందుండి మలవిసర్జనము జేయుచుండును.

పైన వివరించిన ప్రకారము పంచవాయువులు వేరువేరు క్రియలు జేయుచుండును గాన యివియన్నియు ఆత్మగాదు ఆత్మ వీటికి సాక్షియై యున్నది.

జ్ఞానేంద్రియ పంచక వివరణము.

శ్రోత్రేంద్రియము॥ అనగా! చెవులు దీనివల్ల శబ్దము వినుచుందుము దీని కధిదేవత దిశ.

త్వగింద్రియము॥ అనగా! చర్మము దీనివల్ల శీతోష్ణాదులు గ్రహింతుము దీని కాదిదేవత వాయువు.

చక్షురింద్రియము॥ అనగా నేత్రములు దీనిచే నానారూపంబుల జూచుచున్నాము దీని కాదిదేవత సూర్యుడు.

జిహ్వేంద్రియము॥ అనగా! నాలుక దీనిచేత ఆరువిధము లరుచులను మెరుగుచున్నాము దీని కాదిదేవత వరుణుడు.

ఘ్రాణేంద్రియము॥ అనగా ముక్కు దీనిచే సుగంధ దుర్గంధములను దెలియుచున్నాము దీని కాదిదేవత అశ్వినీకొమారులు.

యీ జ్ఞానేంద్రియము లైదును నీవు కనుగొనుచున్నావు కావున నీవు గావు. కర్మేంద్రియ పంచక వివరము.

వాగింద్రియము॥ అనగా! నోరు దీనిచే మాట్లాడుచుందుము దీని కాదిదేవత అగ్ని.

పాణీంద్రియము॥ అనగా! చేతులు దీనిచే పదార్థములు యిచ్చుచు తీసుకొందుము దీని కాదిదేవత ఇంద్రుడు.

పాదేంద్రియము॥ అనగా! కాళ్ళు దీనిచే రాకడ పోకడ గల్గుచుండును దీని కాదిదేవత ఉపేంద్రుడు.

గుహ్యేంద్రియము॥ అనగా! శిశ్నము దీనిచే మూత్రవిసర్జనము సంభోగము జరుగుచుండును దీని కాదిదేవత ప్రజాపతి.

గుదేంద్రియము॥ దీనివల్ల మలవిసర్జనము జేయుచుందుము దీనికి అదిదేవత యముడు.

యీ కర్మేంద్రియము లైదును నీవు గుర్తించుచుంటివి గావున నీవు వాటికంటె వేరుగానున్నావు.

విషయ పంచక వివరణము.

శబ్ద స్పర్శ రూప రస గంధములను యీ అయిదువిషయము లాత్మకు లేవు వీటికంటె ఆత్మ వేరుగానున్నది. యీ అయిదువిషయములందే మనుష్యునకాసక్తి యుండునో అతనికి బంధనము ప్రాప్తించును కాబట్టి యీవిషయపంచక భ్రాంతిని విడువవలెను ఎందుకనగా యీ విషయపంచకమందలి నొకదానియందైన జీవుని కాసక్తి యుండెనేని చేటువాటిల్లును

కాబట్టి యీ అయిదువిషయములం దాసక్తిగల మానవుడు తప్పక నశించునని చెప్పుట యతిశయోక్తిగాదు.

శిష్యు॥ గురువర్యా! యీవిషయ మొక్కొకటి యందాసక్తిగల జీవులెట్లునశింతురో యానతీయఁగోరువాడను.

గురు॥ శిష్యా! ఇదో వచించెద. సావధానమతితో వినుము శబ్ద విషయమందు మృగమున కాసక్తిగలిగి మరణించును ఎటులన మృగముల బట్టువా డరణ్యములో కపటస్వరముతో మృగములు బల్కునట్లుగానే బల్కుచుండును అంత యాపల్కులు మృగములువిని దగ్గరకువచ్చును వచ్చినతోడనే వేటకాడా మృగములను బట్టి చంపును కావున విషయాసక్తిచే నిట్లు మరణము ప్రాప్తించును.

స్పర్శాసక్తిచే ఏనుగలు నాశనమొందును ఎటులన యే యరణ్యమందేనుగలు యెక్కువగానుండునో అచ్చట నుండునట్టి చెంచులు వెలగల యేనుగ దంతములకొరకై విస్తీర్ణమైన గుంత నొకటి ద్రవ్వి పైకి తెలియకుండ తడకలు వేయుదురు అచ్చటికి సమీపమందు కర్రలతో చేయబడి రంగులతో శృంగారించబడిన కృత్రిమ ఏనుగ నుంచెదరు అంత నిజమైన ఏనుగ యాకపటపు ఏనుగంజూచి స్పర్శసుఖము గోరి పైకరికి వచ్చునంతలో గుంతలోబడి నశించును.

రూప విషయాసక్తిచే మిడత నశించును ఎటులన మిడత దీపమును జూచి భ్రమిసి దానిలోబడినంతనే నశించును.

రస విషయాసక్తిచే చేపలు నశించును ఎటులన చేపల బట్టువారు గాలమునకు ఎర్రను గ్రుచ్చి నీళ్ళలో విడుతురు వెంటనే నీటియందుండు చేపలు దాని రుచికి భ్రమసి మింగి నశించును.

గంధవిషయాసక్తిచే భ్రమరము నశించును ఎటులన సూర్యవికాసమువల్ల విచ్చుకొనిన కమలములోని సుగంధమందాసక్తిగలిగి భ్రమరము దానిలో ప్రవేశించి సుగంధమునకు సొక్కి పైకి వెడలుటకు మన సొప్పక యందేయుండును నంత సూర్యాస్తమయమైనతోడనే కమలము మూసికొనును భ్రమరమందులో జిక్కుకొని నశించును కాబట్టి యీ పంచవిషయములం దాసక్తిని మోక్షాపేక్షగలవాడుత్యజింపవలెను.

## తృతీయ ప్రక్రియ

ఇటుల అంతఃకరణ పంచకము జ్ఞానేంద్రియ పంచకము కర్మేంద్రియ పంచకము ఇందులో ప్రతియొక దానియందు అధ్యాత్మ అధిభూత అధిదైవతమను త్రిపుటియుండును ఈత్రిపుటివల్ల క్రియలు జరుగుచుండును ఇదియంతయు నీవు గుర్తించుచున్నావు గాన వీటికి నీవు వేరుగా నున్నావు యిందుకేమాత్రము సందేహములేదు.

శిష్యు! మహారాజా! అంతఃకరణాది పంచకములకు అధ్యాత్మ అధిభూత అధిదైవతములను త్రిపుటివల్ల క్రియలు జరుగుచుండునని తాము జెప్పుచున్నారు అధ్యాత్మ అధిభూత అధిదైవతములన నేవో దయజేసి వచింపగలందులకు ప్రార్థన.

గురు॥ శిష్యా! అంతఃకరణముల యొక్క త్రిపుటులను యీక్రింద నుదహరింప బడిన చక్రమువల్ల తెలియ దగినది.

| అధ్యాత్మ | అధిభూత | అధిదైవత |
|---|---|---|
| అంతఃకరణము | స్ఫురణము | విష్ణు |
| మనస్సు | సంకల్పవికల్పములు | చంద్రుడు |
| బుద్ధి | నిశ్చయము | బ్రహ్మ |
| చిత్తము | చింతనము | నారాయణుడు |
| అహంకారము | అభిమానము | రుద్రుడు |

అంతఃకరణ మనే అధ్యాత్మ స్ఫురణమనే అధిభూతము విష్ణువనే అధిదైవతము యీమూటివల్ల క్రియలు జరుగుచుండును యిందులో నొకటి లేకపోయిన జరుగదు అటులే మనస్సనే అధ్యాత్మ సంకల్ప వికల్పములనే అధిభూతము చంద్రుడనే అధిదేవత యీమూటివల్ల సంకల్పరూప క్రియ యగును ఇటులనే బుద్ధి చిత్త అహంకారములు మొదలగువాటికి ప్రత్యేకముగా త్రిపుటిగలదని తెలియదగినది యీత్రిపుటిని నీవు జూచుచున్నావు కాబట్టి నీవు సాక్షిమాత్రుడవై యున్నావు మరియు జ్ఞానేంద్రియ పంచక త్రిపుటి దిగువ నుదహరింపబడి యున్నది.

| అధ్యాత్మ | అధిభూత | అధిదైవత |
| --- | --- | --- |
| శ్రోత్ర | శబ్ద | దిశ |
| త్వక్ | స్పర్శ | వాయువు |
| చక్షుః | రూప | సూర్యుడు |
| జిహ్వ | రస | వరుణుడు |
| ఘ్రాణ | గంధము | అశ్వినీకుమారులు |

శ్రోత్రమను అధ్యాత్మ శబ్దమను అధిభూతము దిశయను అధిదేవత యీత్రిపుటి యోగంబున ఆలకించు క్రియ జరుగుచుండును ఇందులో నొకటి లేకున్న జరుగజాలదు అనగా వినరాదని తెలియవలెను. చక్షుస్సులను అధ్యాత్మ రూపమను అధిభూతము సూర్యుడను అధిదేవత యీమూటివల్ల చూచునట్టి క్రియజరుగును ఇందులో నొకటి లేకున్న చూడజాలము ఎటులన కన్నులుండి అందులోనుండు పాప లేకపోయిన కానుపింపదు ఇటుల జ్ఞానేంద్రియ త్రిపుటులను దెలియవలెను ఇదియంతయు నీవు గుర్తించుచుంటివి కాబట్టి వీటికంటె నీవు వేరుగానున్నావు మరియు కర్మేంద్రియ త్రిపుటిచక్రము దిగువ నుదహరింపబడుచున్నది.

| అధ్యాత్మ | అధిభూత | అధిదైవత |
| --- | --- | --- |
| వాక్కు | వచనము (మాట్లాడుట) | అగ్ని |
| పాణి | ఆదానము (యిచ్చుటగైకొనుట) | ఇంద్రుడు |
| పాద | గమనము (వచ్చుట పోవుట) | ఉపేంద్రుడు |
| గుహ్య | ఆనందము (సంభోగము) | ప్రజాపతి |
| గుద | విసర్గము (మలత్యాగము) | యముడు |

వాగింద్రియ అధ్యాత్మ వచనము అధిభూతము అగ్ని అధిదైవము యీమూటివల్ల శబ్దోచ్చారణ క్రియ జరుగును ఇందులో ఒకటి తక్కువైన మాట్లాడజాలము యీప్రకారముగా తక్కిన కర్మేంద్రియ త్రిపుటి నిర్ణయమని తెలియవలెను ఇది నీకంటె వేరుగానున్నదని స్పష్టముగా దెలియుచున్నది.

మొదట అంతఃకరణాది యిరువదియైదు తత్వములు జెప్పితిని

ఆతత్వము లన్నియు పంచమహాభూతములయొక్క సాత్విక రాజస తామస గుణములవల్ల బుట్టినవని తెలియువలెను కాబట్టి యీతత్వము లన్నియు పంచమహాభూతములవేగాని నీవికావు నీవు ద్రిష్టవు సాక్షివై యున్నావు.

శిష్యు॥ ఆచార్యా! యీ యిరువదియైదు తత్వములలో యేయే తత్వము యేయే భూతముయొక్క సాత్విక రాజస తామస గుణముల భాగంబున గలిగెనో దయచేసి తెలుపగోరెదను.

గురు॥ శిష్యా! పంచభూతములయొక్క సాత్విక గుణంబున అంతఃకరణ పంచకము జ్ఞానేంద్రియ పంచకము గలిగినది రాజస గుణమువల్ల ప్రాణ పంచకమున్ను కర్మేంద్రియ పంచకము గలిగినది తామసగుణము వల్ల విషయపంచకము గలిగినది యీ పంచభూతములయొక్క సత్వరాజస తామస గుణములనుండి గల్గిన తత్వములు యీచక్రము వల్ల దెలియ బడును.

| పంచమహాభూతములు | సాత్వికగుణము | | రాజసగుణము | | తమోగుణము |
|---|---|---|---|---|---|
| | అంతఃకరణ పంచకము | జ్ఞానేంద్రియపంచ | వాయు పంచకము | కర్మేంద్రియ పంచ | విషయపంచకము |
| ఆకాశము | అంతఃకరణము | శ్రోత్ర | వ్యాన | వాక్కు | శబ్ద |
| వాయువు | మనస్సు | త్వక్ | సమాన | పాణి | స్పర్శ |
| అగ్ని | బుద్ధి | చక్షుః | ఉదానము | పాద | రూప |
| జలము | చిత్తము | జిహ్వ | ప్రాణ | గుహ్య | రస |
| పృథివి | అహంకారము | ఘ్రాణ | అపాన | గుద | గంధ |

శిష్యు॥ గురువర్యా అంతఃకరణములైదును జ్ఞానేంద్రియము

లైదును పంచభూతములయొక్క సత్వగుణమువల్ల గల్గినవని చెప్పు చుంటిరి యిందుకు ప్రమాణమేమి.

గురు॥ శిష్యా భగవద్గీతలో "సత్వాత్సంజాయతేజ్ఞానం" అని చెప్పబడియున్నది గాన సత్వగుణమువల్లనే జ్ఞానము గల్గుచుండును ఎటు లనగా అంతఃకరణ మనస్సు బుద్ధి యిత్యాదులవల్ల సుఖదుఃఖములు దెలియుచుండును మరియు శ్రోత్రిత్వక్ చక్షురిత్యాది జ్ఞానేంద్రియముల వల్ల శబ్ద స్పర్శరూపాది విషయ జ్ఞానమగును కావున భగవద్గీతా ప్రమాణ మును బట్టి లేక అనుభవ ప్రమాణమునుబట్టి యీతత్వములు సాత్విక భాగమువల్ల బుట్టినవని తెలియవలెను.

శిష్యు॥ మహారాజా ప్రాణపంచకము కర్మేంద్రియపంచకము పంచ భూతములయొక్క రాజసగుణమువల్ల బుట్టినవని యెట్లు దెలియనగును?

గురు॥ రాజసగుణలక్షణము ప్రాణ కర్మేంద్రియ పంచకముల యొక్క క్రియలయందు కనుపట్టును గాన యివి రాజసగుణమునుండి పుట్టినవని తెలియవలెను.

శిష్యు॥ విషయపంచకము తమోగుణమువల్ల గల్గెనని ఎట్లు దెలి యవలెను?

గురు॥ పంచవిషయములందు జ్ఞానములేదు అవి కేవల జడరూప ములుగానున్నవి కాబట్టి తమోగుణమువల్ల గల్గినవనే చెప్పనగును యీ తత్వములన్నియు నీవు గుర్తించుచుంటివి గావున నీవు వేరు యీతత్వములు వేరు యివన్నియు పంచభూతములవి నీవు కర్తవుగావు భోక్తవుగావు కేవల సాక్షిమాత్రుడవు

పంచమప్రక్రియ.

శిష్యు॥ గురువర్యా నాయొక్క ఆత్మ అకర్త అభోక్తయని యంటిరే అట్లైన యీదేహమందు కర్తయనువారెవరు సుఖదుఃఖము లనుభవిం చువారెవరు మరియు నీసుఖదుఃఖములకే యే సాధనమువల్ల యే భోక్త భోగించునో యివన్నియు స్పష్టముగా నాకు దెలియునటుల తెలియజేయ గలందులకు ప్రార్థన.

గురు॥ ఈ దేహమందుండు అంతఃకరణము లైదును కర్తలై

భోక్తలై యుండెను పంచప్రాణము లీకర్తభోక్తలకు వాహనములై యుండెను జ్ఞానేంద్రియములైదును వాటికి ద్వారములైయుండెను విషయంబులైదును వాటికి భోగంబులైయుండెను నీవు వీటి నన్నిటిని గుర్తించుచుంటివి కాబట్టి కర్తవుగాను భోక్తవుగ్గాను అనంగుడవగు ఆత్మవై యున్నావు.

శిష్యు॥ గురువర్యా మీరిట్లు సాధారణముగా వచింపుటచే నాకు తెలియకుండెను కాబట్టి అంతఃకరణపంచకములో నేదేది కర్తయో భోక్తయో యే యే వాహనముపై నెక్కి యే యే ద్వారము కరుదెంచి యే యే భోగమును భోగించునో వాటికే యేసేవకుడు సేవజేయునో యవన్నియు స్పష్టముగా తెలియునటుల వచింపగలరని గోరుచున్నాను.

గురు॥ ఆకాశముయొక్క అంతఃకరణము కర్తగా భోక్తగానుండి వ్యానవాయువను వాహనముపై గూర్చుండి శ్రోత్ర ద్వారముకే తెంచి శబ్దవిషయమును భోగించును అనగా చెవులయొక్క యోగంబున అనుకూల ప్రతికూల శబ్దంబులను వినును అట్లు వినినతోడనే అంతఃకరణమందు సుఖదుఃఖరూపమగు భోగమగును వాక్కు అనే సేవకుడు అంతఃకరణముయొక్క సేవజేయుచుండును అందువల్ల అంతఃకరణము కర్తగా భోక్తగా యుండెను.

వాయువుయొక్క॥ మనస్సు కర్తగా భోక్తగానుండి సమానవాయువను వాహనముపై గూర్చుండి త్వగ్ద్వారము కరుదెంచి స్పర్శవిషయమును భోగించును మనస్సుయొక్క సేవ హస్తములు జేయును అనగా త్వక్కుకు (చర్మము) చలిబెట్టినచో వస్త్రమును చక్కగా కప్పును వేడిమి గలిగినయెడల సురటిచే విసరును యిటుల నానావిధముల చర్మమునకు హస్తములే సేవజేయును చర్మముపై చందనాదులయొక్క అనుకూల స్పర్శసుఖము మరియు ఉష్ణము మొదలగు ప్రతికూల స్పర్శదుఃఖమును మనస్సుకు గలుగును కాబట్టి మనస్సు సుఖదుఃఖములయొక్క కర్తగా భోక్తగానున్నది.

అగ్నియొక్క॥ బుద్ధి కర్తయై భోక్తయైయుండి ఉదానవాయువను వాహనముపై గూర్చుండి చక్షుః (నేత్ర) ద్వారమునకే తెంచి రూపవిషయమును గ్రహణముజేయును దాని సేవకుడు పాదములు ఎటులనగా

యేదైన చూడదలచిన పాదములవల్లనే పోగలుగును మరియు నేత్రముల వల్ల ప్రియాప్రియమగు పదార్థములను జూచినతోడనే బుద్ధికి సుఖ దుఃఖములు గల్గును.

జలముయొక్క! చిత్తము కర్తయై భోక్తయైయుండి ప్రాణవాయు వను వాహనముపై గూర్చుండి జిహ్వా ద్వారమున కరుదెంచి రసవిషయ మును భోగించును దాని సేవకుడు శిశ్నము రసమును త్యజించును అనగా జిహ్వావల్ల మధుర కట్వాది రసముల గ్రహణమొనర్చుటచే చిత్తముకు సుఖదుఃఖములు గల్గును.

పృథివియొక్క! అహంకారము కర్తయై భోక్తయైయుండి అపాన వాయువను వాహనముపై గూర్చుండి ఘ్రాణ (ముక్కు) ద్వారము కరు దెంచి గంధవిషయమును భోగించును దానిసేవకుడు గుదము మలమును విసర్జించును ముక్కువల్ల సుగంధదుర్గంధములను భోగించుటవల్ల అహం కారమునకు సుఖదుఃఖములు గల్గును కాబట్టి పై జెప్పిన తత్వములన్ని టిని గుర్తించునట్ట ఆత్మవగుటచే నీవు కర్తవుగావు భోక్తవుగావు నీకు సుఖదుఃఖములు లేవు ఇంకా ఆకాశాది పంచభూతములయొక్క రెండవ విధముగా ప్రతిభూతమునకైదైదుతత్వములుండెను అవన్నియు వచించు వాడ శ్రద్ధతో వినుము. ఆరవ ప్రక్రియ.

గురు! శిష్యా ఇదో వినుము ఆకాశమువల్ల అంతఃకరణము వ్యాన వాయువు శ్రోత్రములు వాక్కు శబ్దము యీాయైదుతత్వములు గల్గినవి.

శిష్య! అయ్యా అంతఃకరణాదితత్వములు ఆకాశమువల్ల గలిగిన వంటికే అవి ఆకాశము లెట్లగునో తెలుపవలెను.

గురు! స్ఫురణరూపమగు అంతఃకరణము ఆకాశమువల్లనే యుత్పన్న మగును మరియు నందులోనే లయమవును అందువల్ల నది యాకాశము వల్ల గలిగినదనవలయును వ్యానవాయువు ఆకాశమువలె దేహమంతట వ్యాపించియుండుటచే నదిగూడా ఆకాశమువల్లనే గలిగినదనవచ్చును: శ్రోత్రేంద్రియము ఆకాశముయొక్క గుణమగు శబ్దము వినుచుండుటచే ఆకాశము దేయగును వాగింద్రియముగూడా ఆకాశముయొక్క గుణమగు శబ్దము నుచ్చరించుటచే ఆకాశము దేయగును శబ్దము ఆకాశముయొక్క

గుణమే యైయున్నది.

వాయువు॥ మనస్సు సమానవాయువు త్వక్ పాణి స్పర్శములను యీ యైదు తత్వములు వాయువువల్ల గలిగినవి.

శిష్యు॥ అయ్యా యీతత్వములు వాయువువల్ల గలిగినవని యెట్లు తెలియవలెను.

గురు॥ మనస్సు వాయువువలె చలించును కాబట్టి వాయువువల్ల గలిగినదని చెప్పవచ్చును సమానవాయువు వాయురూపముగానే యున్నది త్వగింద్రియము వాయుగుణంబగు స్పర్శను గుర్తించును కాబట్టి వాయువు వల్లనే గలిగినది హస్తేంద్రియములవల్ల వాయుగుణంబగు స్పర్శయగును స్పర్శయనునది వాయువుయొక్క గుణమేయని తెలియవలెను.

అగ్ని॥ బుద్ధి ఉదానవాయువు చక్షువులు పాదములు రూపము యీతత్వములైదును అగ్నివల్ల గలిగినవి.

శిష్యు॥ ఈ తత్వములు అగ్నివల్ల యెట్లు గల్గెనో కరుణించి తెలుప గోరెదను.

గురు॥ బుద్ధి సుప్రకాశ తేజోమయమై యుండుటచే అగ్నియే యనవలయును ఉదానవాయువు కంఠమందుండి అన్నజలములను విభాగముజేసి వాటిని జఠరాగ్నికడకు దోలించును ఇందువల్ల అగ్నియేయని తెలియవలెను పాదములు విశేషముష్ణముగా నుండును మరియు అగ్నియొక్క గుణమగు రూపమును చూచుటకై బుద్ధిని లేక చక్షువులను దీసికొని పోవును అందుకని పాదేంద్రియము అగ్నిదని చెప్పవచ్చును రూపము అగ్నియొక్క గుణమేయైయుండెను ఇటుల యీతత్వములన్నియు అగ్నివల్ల గలిగినవని తెలియవలెను.

జలము॥ చిత్తము ప్రాణవాయువు జిహ్వ శిశ్నము రసము యీ యైదుతత్వములు జలమువల్ల గలిగినవని తెలియవలెను.

శిష్యు॥ స్వామీ! యీతత్వములు అగ్నివల్ల గలిగినవని యెట్లు తెలియవలెను?

గురు॥ చిత్తము జలమువలె ద్రవించును కాబట్టి జలముదని చెప్ప వచ్చును ప్రాణవాయువు జలములేక నుండనేరదు అందువల్ల జలముదని

గుణమగు రసమును యనవచ్చును జిహ్వేంద్రియము జలముయొక్క గ్రహణము జేయును సర్వకాలము తడిగానుండును కావున జలముదని యనవచ్చును శిశ్నము మూత్రరూప జలమును విసర్జించును అందువల్ల జలముదని చెప్పవచ్చును రసము జలముయొక్క గుణమై యున్నదని తెలియవలెను.

పృథివి॥ అహంకారము అపానవాయువు ఘ్రాణము గుదము గంధము యీ యైదుతత్వములు పృథివివల్ల గలిగినవని తెలియవలెను.

శిష్యు॥ యీ పంచతత్వములు పృథివివల్ల గలిగినవని యెట్లెరుంగ వచ్చును.

గురు॥ అహంకారము పృథివివలె చాలా గొప్పదిగానున్నను జడము గానున్నది కాబట్టి పృథివిదనే యనవలెను అపానవాయువు పృథివియొక్క భాగమగు మలమును గుదద్వారమునుండి విసర్జింపజేయును అందువల్ల పృథివిదని తెలయవలెను ఘ్రాణేంద్రియము పృథివియొక్క గుణమగు గంధమును గుర్తించును కాబట్టి పృథివిదేయగును గుదేంద్రియము పృథివి యొక్క భాగమగు మలము విసర్జించును కాబట్టి పృథివివల్ల గలిగినదని యనవచ్చును గంధము పృథివియొక్క గుణమేయైయుండెను ఇటుల పంచభూతములయొక్క యిరువదియైదు తత్వములకు సాక్షివగు నీవు ఆత్మవైయున్నావు యీతత్వములేవియు నీవు కావు నీవు వేరుగానున్నావు.

సప్తమక్రియ.

శిష్యు॥ గురువర్యా మొదటి ప్రక్రియయందు ఆకాశమువల్ల అంతఃకరణములైదును వాయువువల్ల ప్రాణములైదును అగ్నివల్ల జ్ఞానేంద్రియములైదును జలమువల్ల కర్మేంద్రియములైదును పృథివివల్ల విషయంబులైదును బుట్టినవని మీరు నిరూపణము జేసియుంటిరి ఇప్పుడీ ప్రక్రియయందు నింకొకవిధముగా నిరూపణ జేసితిరి కాబట్టి యీ రెండు ప్రక్రియలయొక్క నిరూపణమునందు భేదముండుటకు కారణమేమో దెలియకుండెను దయజేసి స్పష్టముగా దెలుపగలందులకు వేడుచున్నాను.

గురు॥ ముఖ్యముగా పంచభూత పంచీకరణముయొక్క పదునేను తత్వముల వల్ల సూక్ష్మదేహ ముత్పన్నమైనదని వేదాంత గ్రంధములందు

చెప్పబడియున్నది స్థూలరీతిగా భిన్నభిన్న ప్రక్రియల యోగంబున తత్వములన్నియు విస్తారముగా భిన్నమై ముముక్షుడు తెలిసికొనుటకై పంచీకరణ సూక్ష్మదేహముయొక్క కోష్ఠకమందు ఇరువదియైదు తత్వములని నిరూపణ చేయబడియున్నది అందులో ప్రతిభూతము యొక్క మొదటి శుద్ధ తత్వములను రెండవ భూతముల యొక్క తత్వములు గలియుటచే మిశ్రితమైన తత్వములు అనగా 'ఉదాహరణార్థము' ఆకాశతత్వము వాయువిత్యాది మిగత భూతములతో గలసి వాయుతత్వములు ఆకాశాదితత్వములతో గలసి ఇటులే అగ్ని జలము పృథివి యిందులో ప్రతియొకదాని తత్వములు మిగత భూతములతో గలసి యిటుల రెండువిధముల తత్వముల నిరూపణము జేసినందువలన మొదటిప్రక్రియకున్ను ఆరవప్రక్రియకున్ను భేదము గలిగియుండెను వేరువేరుగా నిరూపణజేసిన తత్వములందు యెంత భేదము గలిగినప్పటికిన్ని పంచభూతములవగుటచే అనాత్మరూపము దృశ్యమైయున్నవి కాబట్టి ఆత్మ వేరుగానున్నదని తెలియవలెను.

### అష్టమక్రియ

శిష్యు! సూక్ష్మదేహమునకు యిరువదియైదు తత్వములని వచించియుంటిరి కాని ఇంకా నేమైన వేరే తత్వములుగలవా లేక యిరువదియైదు తత్వములే యుండెనా దయజేసి వచింపగోరెదను.

గురు॥ వేదాంతశాస్త్రములందు అనేకచోట్ల జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు పంచప్రాణములు మనస్సు బుద్ధి గలసి పదునేడు తత్వములు సూక్ష్మదేహమని చెప్పబడియున్నది కొన్నిచోట్ల మనస్సు బుద్ధి యొక్కటేయని చెప్పుటచే పదహారుతత్వములనియు కొన్నిచోట్ల మనస్సు బుద్ధి చిత్తము అహంకారముగలసి పందొమ్మిది తత్వములనియు కొన్నిచోట్ల అష్టపురమందలి యిరువదియేడు తత్వములనియు యీవిధముగా సూక్ష్మదేహమునకు చెప్పబడియున్నది.

శిష్యు॥ గురువర్యా అష్టపురమందలి యిరువదియేడు తత్వములతో సూక్ష్మదేహము గలిగినదంటిరే అదియెట్లో వచింపవేడెదను.

గురు॥ నాయనా జ్ఞానేంద్రియములైదు మొదటిపురము కర్మేంద్రియములైదు రెండవపురము అంతఃకరణ చతుష్టయము మూడవ

పురము ప్రాణపంచకము నాలవపురము పంచమహాభూతము లైదవ పురము అవిద్య ఆరవపురము కామము యేడవపురము కర్మ మెనిమిదవ పురము యీ యెనిమిది పురములు గలసి యిరువదియేడు తత్వములగును యీ తత్వములన్నియు దృశ్యములు జడవికారములై యున్నవి నీవు నిర్వికారుడవగు ఆత్మరూపుడవు కావున నీవీ తత్వములకంటె వేరుగా నున్నావు.

శిష్యు॥ స్వామీ! మీరిటుల తత్వములను వేరువేరుగా జెప్పి యుంటిరి కాబట్టి యిందులో నేనెన్నితత్వములని గ్రహించవలెను దేహ ముంజూడ నొకటే యగుపడుచున్నది యిందులో తత్వములు వేరువేరను చున్నారు ఇందుకు కారణమేమో దెలియకున్నాడను.

గురు॥ అరే నాయనా! నీకు ముఖ్యమైనదొక ముచ్చట దెల్పెద వినుము ఎన్ని ప్రక్రియలవల్ల ఆత్మ అసంగ అజరామర సచ్చిదానంద స్వరూపమని తెలియనగునో అన్నియే ప్రక్రియలని గ్రహించవలెను, కొన్నిచోట్ల కార్యకారణములనుగూర్చి నొకదానిలో నొకటి కల్పితము జేయుటవలన కొన్ని తత్వములే జెప్పబడెను, కొన్నిచోట్ల కార్య కారణములు ప్రత్యేకముగా వేరువేరు గల్పించి నిరూపణ జేసినందువల్ల తత్వము లెక్కువగా జెప్పబడెను కాని యీతత్వములన్నియు దృశ్యములు అనాత్మరూపములు జడములై యున్నవి వీటిని త్యజింపవలయును యీతత్వ ములనుగూర్చి నీవు చిక్కులలోబడ నవసరములేదు యీ తత్వము లన్నిటికి నీవు ద్రష్టవు పరిణామ రహిత చైతన్యుడవు ఆత్మరూపుడవు అని యీవిధముగా అపరోక్షమార్గమున దృఢనిశ్చయము జేసికొనవలెను.

## తొమ్మిదవ ప్రక్రియ.

గురు॥ శిష్యా! ఇటులైతే స్థూలదేహము అన్నమయకోశమో అటులే సూక్ష్మదేహమందుగూడా ప్రాణమయ మనోమయ విజ్ఞాన మయమను మూడు కోశములుగలవు వీటి కన్నిటికంటె నీవు వేరని దలచ వలెను.

శిష్యు॥ గురువర్యా! సూక్ష్మదేహము యొక్క కోశత్రయమును వేరువేరుగా వదింపగోరెదను.

గురు॥ పంచప్రాణములు పంచకర్మేంద్రియములుగలసి యీ పది తత్వములు ప్రాణమయకోశము లేక పంచప్రాణములు పంచ ఉపప్రాణములుగలసి ప్రాణమయకోశమని తెలియవలెను.

శిష్యు॥ పంచప్రాణములను యెరుగుదుగాని పంచ యుపప్రాణములన నెవ్వియో నాకు దెలియదు కాబట్టి వాటి నామములు క్రియలు విపులముగా వచింపగలందులకు ప్రార్థన.

గురు॥ నాగ కూర్మ కృకర దేవదత్త ధనుంజయ అను నీయైదు ప్రాణులని చెప్పబడును వీటివల్ల వేరువేరు క్రియలు జరుగుచుండును ఎటులనగా నాగవాయువువల్ల చేకోట్లు పుట్టును, కూర్మవాయువు కన్నులను మూయించును తెరచునట్లు జేయును, కృకరవాయువువల్ల తుమ్ము వచ్చును, దేవదత్తవాయువువల్ల ఆవలింతలు గల్గును, ధనుంజయవాయువు దేహమును పుష్టిజేయును, మరియు నీ ధనంజయ వాయువు శవములో జేరి పుబ్బించును, యీ పదివాయువులు ప్రాణరూపములు గాబట్టి ప్రాణమయమని పేరొసంగబడనది మరియు నీప్రాణములు ఆత్మను కప్పికొని యున్నవి కాబట్టి కోశమని పేరొసంగబడినది యీ ప్రాణమయకోశములోగా యుండునది మనోమయ కోశమనబడును యీ మనోమయ కోశములోన విజ్ఞానమయకోశముండును.

శిష్యు॥ స్వామీ మనోమయ కోశము విజ్ఞాన మయకోశమన నేమి.

గురు॥ జ్ఞానేంద్రియములైదును మనస్సు నీయారుగలసి మనోమయ కోశమనంబడును మరియు జ్ఞానేంద్రియములైదును బుద్ధితోగలసి విజ్ఞాన మయకోశంబనబడును.

ఈప్రకారముగా సూక్ష్మదేహమందుండు త్రికోశములు నీకంటె వేరుగానున్నవి నీవుగాదు యీసూక్ష్మదేహ త్రికోశములు నీవుగానప్పుడు కర్తృత్వ భోక్తృత్వములు నీకులేవు సుఖదుఃఖాదులు అంతఃకరణ ధర్మము వినుట చూచుట మొదలగునవి జ్ఞానేంద్రియ ధర్మము మాట్లాడుట యిచ్చుట పుచ్చుకొనుట కర్మేంద్రియధర్మము క్షుధ తృష్ణ మొదలగునవి ప్రాణధర్మము యిందులో నొకటిగూడా నీలోలేదు కాబట్టి

యీకోశత్రయమునకు నీవు వేరుగానున్నావు ఇందులో నెంతమాత్రము సందేహములేదు వీటికన్నిటి నీవు సాక్షిమాత్రుడవు ఆత్మవు.

ఇటుల సూక్ష్మదేహ కోశకములో తొమ్మిది ప్రకృతియుల నిరూపణము జేయబడినది బ్రహ్మనిష్ఠగల సద్గురూపదేశమును వడసి నీవు సూక్ష్మదేహముకంటె విలక్షణ సద్రూప ఆనందరూప అకర్త అభోక్త అసంగుడనని నిశ్చయముజేసుకొని భౌతిక అనాత్మరూపమగు సూక్ష్మదేహము నాదియను మమకారము విడిచిపెట్టవలెను సూక్ష్మదేహమునకు స్వప్నావస్థయని తెలియదగినది.

శిష్యు॥ మహారాజా! స్వప్నావస్థయననేమి?

గురు॥ జాగ్రదవస్థలో నేమిజూచుచున్నావో యేమేమి యనుచున్నావో అదియంతయు అంతఃకరణమందు జేరియుండుటవల్ల నిద్రయందు తోవలు నదులు అరణ్యములు పట్టణములు స్త్రీపుత్రాది కుటుంబ వ్యవహారములు సుఖదుఃఖ ప్రపంచ సంగతులు స్వప్నమందు దోచుచుండును యిందులో నేదియు నెంతమాత్రము సత్యమైనదిగాదు కాని నిజముగా దోచుచుండును దీనిని స్వప్నావస్థయని వచింతురు.

ఈ స్వప్నమును నీవు కనుగొనుచుంటివి యీ యవస్థ సూక్ష్మదేహముదైయున్నది నీదికాదు యిందులో నెంతమాత్రము సందేహము లేదు స్వప్నము కంఠస్థానముందుండును కంఠమందు "హిత" యను నాడి గలదు దానిలో స్వప్నావస్థగలుగును యీయవస్థలో "మధ్యము" యను వాణిగలదు మరియు "ప్రవిక్త" యను భోగముండును అనగా (సూక్ష్మవాసన మయమను భోగము) ఎటులన కస్తూరి పునుగు జవ్వాజి మొదలగు సుగంధ ద్రవ్యము లొక పెట్టెయులో బెట్టి కొన్నిరోజులకు దీసినప్పటికిన్ని ఆపెట్టెలో వాసనమాత్రము నిలుచును అటులే జాగ్రదావస్థయందు జరిగిన వ్యవహారము స్వప్నావస్థలో దోచుచుండును జాగ్రదవస్థలో అన్నభక్షణమువల్ల సుఖమయ్యె శరీరము పుష్టియగును శరీరముపైన నేదైన శస్త్రము తగిలిన రక్తము స్రవించును అటుల స్వప్నమందు కాజాలదు ఎందుకనగా స్వప్నమందు అన్నభక్షణముగాదు శరీరము పుష్టిగాదు శరీరముకు శస్త్రము తగిలిన రక్తము వెళ్ళదుగాని। సుఖదుఃఖములు

మాత్రము దోచుచుండును కాబట్టి సూక్ష్మభోగమని చెప్పబడినది మరియు స్వప్నమందలి జ్ఞానశక్తి అనగా స్వప్నమందలి పదార్థములను గుర్తించునది సత్వగుణము.

శిష్యు॥ శాస్త్రములందు జాగ్రితయందు సత్వగుణమనియు స్వప్నమందు రజోగుణమని యెన్నియోచోట్ల చెప్పబడియున్నది తాము మాత్రి మట్లు నుడువక జాగ్రితలో రజోగుణమనియు స్వప్నములో సత్వగుణముండునని చెప్పుచున్నారు యిందులకు కారణమేమో తెలుప వలయును.

గురు॥ కొన్నిచోట్ల జాగ్రిదవస్థలో సత్వగుణముండునని చెప్ప డానికి కారణమిదిగదా జాగ్రిదావస్థలో విషయజ్ఞానముండును శాంత శమదమాది గుణములుగల్గును మోక్షాపేక్షగలవాడు సద్గురుసన్నిధిం జేరి వారి శరణుజొచ్చి శ్రివణమననాదులు జేయుటవల్ల ఆత్మజ్ఞానము గల్గును కాబట్టి జాగ్రిదవస్థలో సత్వగుణముండునని చెప్పబడినది కాని నేను రజోగుణమని చెప్పుటకు కారణమిదిగదా జాగ్రిదవస్థలో జరిగెడు క్రియలన్నియు రజోగుణాత్మకమైయుండును స్వప్నమందలి క్రియలు విషయరూపమేగాని క్రియగాజాలదు అందువల్ల స్వప్నమందు సత్వగుణ ముండుదని వచించితిని స్వప్నమందు ప్రణవముయొక్క రెండవదియగు ఉకారరూపమగు మాత్రయుండును స్వప్నమందు సుఖదుఃఖముల భోగించు తేజస్సుయను అభిమానియుండును యీప్రకారముగా పైజెప్పబడిన స్వప్నమందలి యెనిమిది తత్వములకు నీవు ద్రిష్టవు గాన యీ తత్వ ములు నీవుగావు యింతకుముందు చెప్పబడిన అంతఃకరణాది యిరువదియైదు తత్వములు యిప్పుడు వచించిన స్వప్నావస్థాది యెన్మిది తత్వములు గలసి ముప్పదిమూడు తత్వములయ్యెను యివి సూక్ష్మదేహమువని తెలియ వలెను సుబుద్ధిగల యో యాత్మాడా యీ ముప్పదిమూడు తత్వము లకు నీవు ద్రిష్టవు యీ దృశ్యతత్వములు నీవుకావు యీతత్వములు వేర్వేరుజేసి చూచిన ఆత్మవేరు తత్వములు వేరని స్పష్టముగా దెలియు చుండెను కావున చక్కగా విచారించి తెలిసికొంటివేని ఆత్మవేరు తత్వ ములు వేరని నీకు పూర్ణానుభవము కాగలదు.

గీ॥ ఘటముజూచువాడు ఘటమెట్లగును తాను ♦ ఘటముకంటె వేరుగాదెలెలప ♦ దేహద్రిష్టయటులె దేహంబుకంటెను ♦ వేరుగాను యుండె వినుముశిష్యా!

ఘటమునుజూచువాడు ఘటముకంటె వేరుగానుండుట ప్రత్యక్షముగా దోచుచుండెను అటులే జడమగు దృశ్యశరీరముకన్న నీవు వేరుగానున్నావు యీవిధముగా స్థూలసూక్ష్మదేహముకంటె ఆత్మ వేరుగానున్నదని శిష్యుడు సంపూర్ణముగా గ్రహించినయెడల మూడవకారణదేహముకంటె ఆత్మ వేరుగానున్నదని గ్రహించుటకు తెలివిగలుగును.

శిష్యు॥ గురుజీవా! కారణదేహమనగానేమి.

గురు॥ మొదటిది స్థూలదేహము రెండవది సూక్ష్మదేహము యీ రెండు దేహములయొక్క అపేక్షతోనుండునది కారణదేహము అనగా అజ్ఞానమని తెలియపలెను.

శిష్యు॥ అజ్ఞానమునకు కారణమని యెందుకనియెదరు.

గురు॥ అజ్ఞానమువల్లనే స్థూలసూక్ష్మదేహములు తత్స్వరూపకార్యములై యుండెను అందునుగూర్చి అజ్ఞానమునకు కారణదేహ మనబడినది ఎటులైతె స్థూలసూక్ష్మదేహములకు నీవు ద్రిష్టవైయున్నావో అటులే కారణదేహమునకుగూడా నీవు ద్రిష్టవు నీవు జ్ఞానరూపుడవు కారణదేహ మజ్ఞానరూపముకాబట్టి నీవు వేరు కారణదేహము వేరు.

శిష్యు॥ స్వామీ! స్థూలదేహతత్వములు చక్కగా కనుపించుచున్నవి సూక్ష్మదేహతత్వములు అనుభవముగాకుండినప్పటికిన్ని స్పష్టముగా దెలుసుకోనగుచున్నవి యీ స్థూలసూక్ష్మదేహములకు నేను ద్రిష్టనని మీబోధవల్ల నిశ్చయమయ్యెను కాని యీకారణదేహమునకు నేను ద్రిష్టనని చెప్పుచుంటిరి కాబట్ట నాకనుభవమగుటలేదు దయయుంచి చెప్పగలందులకు ప్రార్థన.

గురు॥ అరే నాయనా! మూడవదియగు కారణదేహమునకు నీవు మూడువిధముల ద్రష్టవైయున్నావు.

శిష్యు॥ గురువర్యా! అజ్ఞానమును మూడువిధంబుల నేనెట్లెరుంగగలనో దెల్పగలరు.

గురు॥ "స్థూలసూక్ష్మ దేహమువలె నేనెరుంగుదుగాని నన్ను నే గుర్తెరుంగను" అని యిటుల నీవు మొదట యనుచుంటివిగదా దానిపేరే అజ్ఞానము యీ అజ్ఞానమునకు నీవు ద్రష్టవు ఎందుకనగా "నేను నన్ను గుర్తెంగను" అని నీవన్నట అజ్ఞానములేక సంభవించునదిగాదు మరియు నన్ను గుర్తెరుగననియే యెరుకచే బలుకుచుంటివో అదే నీవు అజ్ఞానరూపుడవు అజ్ఞానములేక యీ యెరుకమాటలు గలుగజాలవు మరియు నీవు జ్ఞానరూపివిగాక అజ్ఞానము జడరూపమైనయెడల నన్నునే గుర్తెరుగనని బలుకజాలవు మంటికుండ అజ్ఞాని జడరూపియగుటచే నన్నునే గుర్తెరుగనని బలుకజాలదు అటులగాక నీవు నన్నునే గుర్తించకున్నానని యేగుర్తుచే బలుకుచుంటివో అదే అజ్ఞానము యీ అజ్ఞానము దృశ్యము నీవు ద్రష్టవు యిది యొకవిధము ఇక రెండవవిధము వినుము నేనజ్ఞానినని నీవనుచుండెదవు యిటులనుటచే నిట్లు సిద్ధమగుచుండెను గదా యే అజ్ఞానము దృశ్యముగా నుండెనో దానిని నీవు ముందుగా దెలియుచున్నావు తదనంతరము దానిని నీమీద ఆరోపించుకొని నేనజ్ఞానినని బలుకుచుండెదవు దీనివల్ల యీ అజ్ఞానమును గుర్తెరుంగు నీవు జ్ఞానరూపాత్మవు అజ్ఞానముకంటె వేరుగానున్నావు నీవే అజ్ఞానముకంటె వేరుగా లేకపోయినచో నేనజ్ఞానినని బలుకజాలవు యిక మూడవ విధమెట్లన స్థూలదేహముయొక్క లావు సన్నము నలుపు తెలుపు మొదలగు ధర్మములు నీవు తెలియజాలుదువు కావున శరీరమున్ను శరీరమునుగుర్తించు నీవునన్ను వేరుగానున్నావని తాననంతటనే స్పష్టముగా తెలియుచుండెను అయినప్పటికిన్ని తప్పితభావనతో నేను లావుగానున్నాను నేను బక్కగా నున్నాను నేను నలుపుగానున్నాను నేను తెలుపుగానున్నానని భావించుచుండెదవు యిటువలెనే అజ్ఞానముయొక్క దృశ్యరూపము దెలిసియుండి భ్రమవల్లనే నజ్ఞానినని బలుకుచుందువు చక్కగా విచారముజేసి చూచినయెడల అజ్ఞానమును గుర్తించు నీవా యజ్ఞానముకంటె వేరుగానున్నావని నీకే దెలియును అట్లు దెలసినపిమ్మట నేనజ్ఞానినని బలుకజాలవు అసద్రూపావరణ ఆభాసావరణములను నీరెండవజ్ఞాన రూపములను నీవు గుర్తింపజాలుదువు.

శిష్యు॥ మహారాజా! అసదావరణ అభానావరణ మనగా నేమి?

గురు॥ నాయనా! నీవు ఆత్మ నెరుగుదువాయని నిన్నెవరైన యడిగినచో నేమందువు ఆత్మయుండు టెక్కడ దాని నేనెట్లు దెలియుదును అని యిటుల బలుకుచుండెదవు అనగా ఆత్మలేదు చూచుటలో నగుపడునదిగాదు అని వాక్కు నీనోటనుండి వెడలును ఇందులో "ఆత్మలేదు" అనునది అసదావరణ "ఆత్మ చూచుటలో నగుపడదు" అనుట అభానావరణమని దెలియదగినది మరియు ఆత్మలేదు అగుపడదు అని దేనిచే గుర్తించితివో అదే ఆత్మయైనప్పటికిని నేనాత్మనుకాను మనుష్యుడను కర్తను భోక్తను నాకు ప్రశ్నోత్తరములచే సిద్ధముజేయరాదు యిటుల నీవనుచుండినదంతయు అజ్ఞానమే యిదియంతయు నీవు గుర్తించుచుంటివి కావున మూడవదియగు అజ్ఞాని కారణదేహము నీదిగాదు.

శిష్యు॥ అజ్ఞానియగు కారణదేహము నేను గాననుటకు ప్రమాణమున్నయెడల వచింపవేడువాడను.

గురు॥ శిష్యా! మూడుధవిములజూడగా కారణదేహముకన్న ఆత్మ వేరుగానున్నదని విద్వాంసులయొక్క అనుభవమునే నీకు జెప్పియుంటిని యీయనుభవమే యిందుకు ప్రమాణము ఆత్మ సూర్యునివలె స్వయంప్రకాశమై అజ్ఞానముకంటె వేరుగానున్నదని శృతులు నిరూపణము జేయుచున్నవి కావున విచారశక్తివల్ల మూడవకారణ దేహముకన్న నేను వేరుగానున్నానని నిశ్చయముజేయవలెను.

కం॥ వినుకారణదేహమునకు ♦ నెనిమిదితత్వములుగలవు ఎరిగింతునికిఁ ♦ పనిబూనిసూక్ష్మబుద్ధితొ ♦ కనుగొనిసందేహముడుగు గదరాశిష్యా॥

శిష్యా! యీకారణము కెనిమిది తత్వములుగలవు వాటి నెల్ల వివరించెద శ్రద్ధతో వినుము (1) సుషుప్త్యవస్థ (2) హృదయస్థానము (3) పశ్యంతివాచ (4) ఆనందభోగము (5) ద్రవ్యశక్తి (6) తమోగుణము (7) మకారమాత్ర (8) ప్రాజ్ఞాభిమాని యిటుల యెనిమిది తత్వములు గలవు.

శిష్యు॥ సుషుప్త్యవస్థయనగానేమి?

గురు॥ గాఢనిద్రలో నింద్రియ వ్యాపారములున్ను సర్వవృత్తి

సంయుక్తబుద్ధియు కారణదేహములో యణగిలయు రూపముగానుండును అనగా జాగ్రత్స్వప్నములందలి భిన్న భిన్న వ్యవహారములు గాఢ నిద్రలో నించుకైన ననుభవముగాకుండును కావున గాఢనిద్రనే సుషుప్త్యవస్థయందురు శృతులయందుగూడా నిట్లే చెప్పియున్నది అనగా గాఢనిద్రయందు జీవుడుండికూడా శబ్దాదివిషయములందలి కోరిక లెంత మాత్రము గలుగకుండును ఎటువంటి స్వప్నముగూడా కలుగకుండును దీనిని సుషుప్త్యవస్థయందురు యీ సుషుప్తికి నీవు ద్రష్టవు యెటులన సుషుప్తినుండి జాగ్రత గలిగినతోడనే నేను సుఖముగా నిద్రించితిని ఆసమయములో సుఖముదప్ప మరేమియు గుర్తులేక యుండెను అని యిటుల నీవు స్మరణపూర్వకంగా జెప్పెదవు దీనివల్ల నిట్లు కనుపట్టుచుండె గదా సుషుప్తియందు సుఖమేయుండును సుఖముదప్ప యితరమేమియుం డదు యిట్టి సుషుప్తియందలి సుఖము ననుభవించు నీవు ఆత్మవుకాబట్టి మెలకువజెందినతర్వాత యాసుఖమునుగూర్చి చెప్పుచుందువుగాని సుషు ప్తియందు దుఃఖమయప్రపంచముయొక్క అభావానుభవమునీకు గల్గక పోయినప్పటికిని మెలకువజెందినతర్వాత నేనీ వేళ్ళ సుఖముగా నిద్రిం చితిననే చెప్పుచుందువు శాస్త్రములందు నిటులే చెప్పబడియున్నది జీవునికేనుచ్చట యనుభవములోనికి వచ్చునో యదియే కాలాను గుణ్యముగ స్మృతియగును ఇందుకు దాహరణము ఒక మనుష్యుడు కాశియాత్రకేగి విశ్వేశ్వరాలయము జూచివచ్చి కొంత కాలము గడచిన తర్వాత నతనికి విశ్వేశ్వరాలయము స్మృతియగుచునే యుండును అటు వలె సుషుప్తిలో సుఖముదప్ప మరేమిలేదని జీవు డనుభవము జేసియుం డుటవల్ల మెలకువజెందినతర్వాత నేను సుఖముగా నిద్రించితినని చెప్పును యిందుకొక దృష్టాంతమును వచించెద వినుము.

దృష్టాంతము॥ రాత్రియంతయు గస్తు దిరుగుచు పారాయందుండు శిపాయివద్ది కొకమనుష్యుడుపోయి అయ్యా రాత్రి పన్నెండు ఘంటలకు యీమార్గముగుండా నొక మనుష్యుడు పోయినట్టుగ మీరు చూచియుం టిరాయని యడుగగా నందులకా శిపాయి పోలేదని జెప్పెను అతని మాటల కామనుష్యునకు విశ్వాసముగలిగెను ఎముకనగా ఆ శిపాయి

రాత్రి పన్నెండు ఘంటల కామార్గమందున్నాడు కాబట్టి యెవ్వరు పోకే దని చెప్పెను అతడా సమయమందచ్చట లేకపోయినచో అట్లు చెప్పుటకు వీలుపడదు అటులే గాఢనిద్రయందు ఆత్మ ప్రకాశమానమై యుండును కావున నాకు సుఖముగా నిద్రపట్టినదని చెప్పుచున్నావు గాఢనిద్రయందు ఆత్మ లేకపోయినయెడల నిద్రాసుఖమును గుర్తింప జాలవు కాబట్టి గాఢనిద్రయందు ఆత్మ స్వయంప్రకాశముగా నుండునని సిద్ధమగును.

శిష్యు॥ గురువర్యా ! సుషుప్త్యవస్థను ఆత్మ గుర్తించుచున్నదని సెలవిచ్చితిరి కాని నేను సుషుప్త్యవస్థను గుర్తించెదనని ఆత్మ నిద్రయందే బలుకక మెలకువజెందినపిదప నేల బలుకుచున్నది.

గురు॥ శిష్యా! సుషుప్త్యవస్థయందు సర్వేంద్రియములు మనస్సు బుద్ధి యిత్యాది అంతఃకరణములు అజ్ఞానమందులయమైయుండును కాబట్టి అట్టి సమయమందగుచుండే యనుభవము వచించుటకు వాక్కు మొదలగు సాధనములు లేకపోవుటచే నిద్రయందు వచించుటకు వీలుండదు తెలివినొందినపిమ్మట వాక్కు మొదలగు సాధనముల సహాయంబున గాఢనిద్రయందలి సుఖమును వచింపనగును ఎటులన నిందులకొక దృష్టాంతమును వచించెద సావధానచిత్తుండవై వినుము.

దృష్టాంతము॥ ఒకానొక స్త్రీ నీరుదెచ్చుటకై పూరిబైటనుండు భావివద్దకుపోయి త్రాటితో నీరుజేదుచుండగా యామె ముక్కుయందుండు వెలగల ముత్యాలనత్తుచీల యూడి భావియందు బడెను నందులకాయమ్మ మిగుల చింతనొంది నిశ్చేష్టయై నిలవంబడియుండ నంతలో నట కొక మనుష్యుడురాగా యతనింగాంచి యామె యిట్లనియె అయ్యా నీరుజేదుచుండగా అకస్మాత్తుగా నాముక్కుయందుండిన నత్తు యీభావిలో నూడిపడినది నీవించుక దానిందీసి యిచ్చినయెడల యోగ్యమైన బహుమతి నిప్పించెదననుటయు నదివిని యామనుష్యుడు నీటిలో మునిగి లోనికింబోయి వెదకినంత యానత్తు చేతికిజిక్కెను అట్లు చిక్కినతోడనే చాలా సంతోషమయ్యెనుగాని నాచేతికి నత్తు చిక్కియున్నదని నీటియందుండి వచించుట కాతని వాక్కుకు సమర్థత లేకపోయెను యెందుకనగా

నీటియందోక్క వాగింద్రియముదప్ప మిగత యింద్రియములయొక్క వ్యవహారము కాగలదు కారణమిదిగదా వాగింద్రియమున కధిదేవత అగ్నియగుటచే అగ్నికిన్ని నీటికిన్ని చాలా వైరము యిది అందరికి దెల సినవిషయమే యింద్రియములయొక్క దేవతా వినాయింద్రియముల వ్యవహారము జరుగదు అందువల్ల నత్తు జిక్కినందున గల్గు ఆనందము యొక్క అనుభవము యానీటియందుండు తనకే గల్గుచుండెను-గాని పైనుండు యామెతో వచింపవీలుగాకుండెను నీటినుండి పైకియరుదెంచిన పిమ్మట నాకు నత్తు జిక్కినదని వాక్సాధనవల్ల వచించి యామె నత్తు యామెకిచ్చి బహుమతివడిసెను.

సిద్ధాంతము! పై దృష్టాంతములో జెప్పినప్రకారము సుషుప్తిలోని సుఖానుభవము వచించుటకు మనస్సున్ను మరియు వాక్కుయొక్క సాధనలేనందున శక్యముగాదు కాని సుషుప్తియందలి సుఖానుభవము గ్రహించు ఆత్మ మెలకువజెందినపిమ్మట మనోవాక్సాధనములవల్ల నేను సుఖముగా నిద్రించితినని చెప్పును కావున శిష్యా సుషుప్త్యవస్థకంటె ఆత్మ వేరుగానున్నదని నీకు సిద్ధముగాదోచెను గదా మరియు నీ సుషుప్త్యాది యెనిమిదితత్వములలో "పశ్యంతివాచ" అనగా సూక్ష్మవిచారముయొక్క సంస్కారవాచ "ఆనందభోగము" అనగా నిర్విషయానంద భోగము "ద్రవ్యశక్తితమోగుణము" జాగ్రదాది వ్యవహారము కనుకూల పదార్థముల నుత్పన్నముజేయుశక్తి "మకారమాత్ర" ఓంకారమందలి మూడవ మాత్ర "ప్రజ్ఞామాని" సుషుప్త్యవస్థయొక్క అభిమానము గలిగించే చైతన్యము యీ యెన్మిదితత్వములు సుషుప్త్యవస్థవియని తెలియవలెను యీతత్వములు. గాక మరేమితత్వము లీకారణదేహమున నుండవు మరియు నీకారణదేహమును ఆనందమయకోశమనంబడును పై జెప్పిన తత్వములన్నియు నీవు గుర్తించుటచే వాటికి ద్రష్టవైయున్నావు.

శిష్యు! స్వామీ ఆనందమయకోశమనగానేమి?

గురు! కారణదేహమ విద్యామలిన సత్వమందలి క్రియ మోదము ప్రమోదము అను నీమూడువిధముల వృత్తులచే ఆనందము గలుగుచుం డును యీ సత్వముపేరు ఆనందమయకోశమని చెప్పబడినది.

శిష్యు॥ అయ్యా ప్రియప్రమోద మోదములనగా నేమియో వచింపగోరెదను.

గురు॥ మనకిష్టమైన పదార్థముల జూచినప్పుడు యే యానందము గల్గుచుండునో దానిని ప్రియయందురు మనకు ప్రియమైన పదార్థములు లభించినప్పుడు యే యానందముగల్గునో దానిని మోదమందురు మనకు యిష్టమైన పదార్థములు సేవించిననే యానందము గల్గునో దానిని ప్రమోదమందురు యీప్రకారముగా ప్రియమోద ప్రమోద రూపములగు మూడువిధంబుల వృత్తులంబట్టి ఆనందమయకోశమనబడినది కాని యా విషయ జన్య ఆనంద భోగమువల్ల శుద్ధ నిర్వికారి ఆత్మయని తెలియబడునది కాదు అది కోశములచే కప్పబడియున్నందున ప్రియాది త్రివిధ వృత్తులవల్ల గల్గుచుండు ఆనంద సంయుక్తమగు అవిద్యలోని మలిన సత్వమగుటవల్ల దాని కానందమయకోశమని పేరుగలిగినది ఆ యానందమయకోశముయొక్క ప్రకాశుడవయ్యి సమస్తానందములయొక్క మూల సత్వరూపమగు ఆత్మవైన నీవీకోశరూపుడవుకావు కారణ శరీరత్వములు ఆనందమయకోశము వీటికంతటికి నీవు సాక్షివి సచ్చిదానంద నిత్యనిరంతర నిరతిశయ పరమానందరూపుడవని తెలియవలసినది.

శిష్యు॥ గురువర్యా నేను సచ్చిదానందుడననుటకు నాకు స్పష్టముగా బోధయగునటుల సత్తు చిత్తు ఆనందము యీ మూడుపదముల యర్థమును వచింపగలరని వేడువాడను.

గురు॥ జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థాత్రయములందును భూతభవిష్య ద్వర్తమానములను కాలత్రయములందును ఆత్మవగు నీవొక తీరుననుండు వాడవు కావున సత్తుయనియందురు జాగ్రదాది యవస్థాత్రయమును ఆత్మవగు నీవు గుర్తించుచుంటివి కావున చిత్తనియందురు ఆత్మవగు నీవు సర్వకాలములందు పరమప్రేమా స్పదరూపముగా నుండువందున ఆనందమనెదరు.

శిష్యు॥ మహారాజా యీ మూడవస్థలయందు నేను సచ్చిదానందుడనని నిశ్చయించ నాకు స్పష్టముగా బోధపడునటుల నిరూపణ జేయగలరని వేడుచుంటిని.

గురు॥ జాగ్రదవస్థలో నీవు మేలుకువజెందినదిమొదలు నిద్రించు వరకు యేమేమి వ్యవహారము జరుగుచుండునో యదియంతయు నీవెరిగ దవు మరియు శబ్దస్పర్శాది జ్ఞానము గమనాదిక్రియలు మొదలగునవి నీవు గ్రహింతువు చెప్పెదవు యీజాగ్రదవస్థను నీవు దెలిసికొను సద్రూప మగు ఆత్మవు అటుల నీవు సద్రూపాత్మవు గాకపోయినయెడల జరిగే వ్యవహారముల గుర్తింపజాలవు. నీవు తద్రూపుడవయ్యి జాగ్రదవస్థను దెలియుచున్నావు గావున చిద్రూపుడని చెప్పబడుచున్నావు మరియు జాగ్రదవస్థయందు స్త్రీపుత్రదేహేంద్రియ ప్రాణములకన్న ఆత్మ ప్రియమైయుండును కావున ఆనందరూపుడవని చెప్పబడితివి.

వం-గీ॥ ధనముకంటెనుప్రియమండ్రు తనసుతుండు ♦ తనయుకంటెనుతనువును తనువుకంటె ♦ యింద్రియంబులుప్రియమండ్రు యెక్కుడుగను ♦ వానికంటెనుప్రియమండ్రు ప్రాణిమెల్లదు ♦ ప్రాణికంటెను ప్రియమన బరుగునాత్మ॥

అనగా స్త్రీపుత్రులు ధనము పశువులు దేవతలు మొదలగు వారలందరు మనుష్యునకు ప్రియముగానుండును ఎందుకనగా యిదియంతయు తనయొక్క ఆత్మసుఖమునకు సాధనములగుటవలన అట్లు దోచుచుండునుగాని స్త్రీపుత్రాదులు తనకు ప్రతికూలముగా నుండినయెడల నట్లు దోచదు అందువల్ల వీరందరికంటె ఆత్మ యెక్కుడు ప్రియమైనదని దెలియనున్నది కాబట్టి ఆత్మ ఆనంద మయరూపమని స్పష్టముగా అనుభవమగుచుండెను స్థూలసూక్ష్మ కారణదేహములకన్న జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకన్న అన్నమయాది పంచకోశములకన్న అత్మ ద్రష్టయై సాక్షియై సచ్చిదానంద రూపమైయున్నదని సిద్ధమగుచున్నది యాజ్ఞవల్క్యముని తన ధర్మపత్నియగు మైత్రేయిణికిగూడా నిటులే బోధించెను యిటుల యేపురుషుడు దెలసికొనుచున్నాడో అతడే ముక్తుడతడే విద్వాంసుడని ఉపనిషదాది గ్రంథములు బొబ్బలుబెట్టుచున్నవి.

శ్లో॥ అహంసాక్షీతియోవిద్యా । ద్వివిచ్యైవంపునఃపునః
సఏవముక్తఃసోవిద్వా । న్నితివేదాంతడిండిమః॥

పైన వివరించినటుల అవస్థాత్రయము పంచకోశములు మొద

లగు దేహాదికములన్నిటికి నీవు ద్రష్టవని దెలసికొనుటయే విశేషజ్ఞాన మనియెదరు కాని యావిశేషజ్ఞానము వృత్తిజన్యమగుటవల్ల అనగా మనోవృత్తివల్ల నుత్పన్నమగుటచే పరిచ్ఛిన్న విస్మృతియగునట్లుండెను అందువల్ల విశేషజ్ఞాన సాధనము అజ్ఞాననివృత్తికొరకు విని యోగించి నపుడు విశేషజ్ఞానముకూడా కల్పితమేయని గ్రహించి వాస్తవిక పరిపూర్ణ సామాన్య జ్ఞానరూపము బ్రహ్మరూపమం దైక్యమొనర్చుటే మోక్ష సాధనమందురు ఇందుకై విశేషజ్ఞానరూపము నాలవ మహాకారణదేహ మని కల్పించుకొని అట్టి కల్పనారహితుడు కావలెను స్థూలసూక్ష్మ కారణ దేహములను దేహత్రయముయొక్క యపేక్షయే నాలవ దేహమనియెదరు అజ్ఞానము అజ్ఞాన కార్యరూపమగు దేహాది ప్రపంచముయొక్క నివృత్తి జేయునది యగుటచే దీనిని మహాకారణదేహమని యందురు జ్ఞానమే మహాకారణదేహముయొక్క రూపము బ్రహ్మనిష్ఠగల గురుముఖంబున వేదాంత శాస్త్ర శ్రవణమువల్ల నేను స్వయముగా ద్రష్టను సాక్షినై యున్నానని యిటుల మనోవృత్తియందే దైతే విశేషజ్ఞాన ముత్పన్న మగునో అదియే మహాకారణ దేహమనబడుచున్నది యీ మహాకారణ దేహ ప్రకాశకుడవగు నీవాత్మవు శుద్ధస్వరూపుడవు నిర్మలుడవు జ్ఞాన రూపుడవైయున్నావు యీవిశేషజ్ఞానము జాగ్రదవస్థయందే యుండును సుషుప్తిలో నుండదు కాబట్టి అనిత్యమనియు పరిచ్ఛిన్నమనియు నన బడును నీవు సామాన్య జ్ఞానరూపమగు ఆత్మవని తెలియదగినది.

శిష్యు॥ సామాన్యజ్ఞానము విశేషజ్ఞానమని వచించితిరి కాబట్టి యిందువల్ల ద్వైత ముత్పన్నమగును సిద్ధాంతమందైతే అద్వితీయ జ్ఞాన రూపాత్మ యొకటే యున్నదని చెప్పియుంటిరి కావున యీ రెండువిధముల పరస్పర విరోధ మొక్కవిధమెట్లాగున నాకు బోధించగలందులకు ప్రార్థన.

గురు॥ అద్వితీయ సామాన్య జ్ఞానరూపాత్మ యొకటేయున్నది యిది ముమ్మాటికి నిజము సద్గురు శాస్త్రోపదేశమువల్ల వృత్తిద్వారా జన్మించిన విశేషజ్ఞానము అజ్ఞానము నడపించి పిమ్మట తనంతట తానే నివృత్తియగును అనగా యీవిశేషజ్ఞానము సామాన్యజ్ఞానమునుండి

వేరుగానుండదు కాబట్టి యచ్చట ద్వైతమున్నదనుటకు వీలుండదు కేవల సామాన్య జ్ఞానరూపాత్మ యొక్కటేయుండును యిందులకై యొక్క దృష్టాంతము దెల్పెదవినుము.

దృష్టాంతము॥ వర్షకాలమందు నదిలోనుండు నీరు బురదతో గూడుకొని మలినముగా నుండిన యెడల తనకు వలయునంతటి నీరు బిందెలో నింపుకొని దానిలో కతకఫలముల చూర్ణమును వేసినతోడనే యానీటిని శుభ్రపరచి యందులోనుండు మలినంబంతయు యడుగుజేర్చి పిమ్మట యాచూర్ణముగూడా అడుగుజేరును అటులే విశేషజ్ఞానము అజ్ఞానమును నశింపజేసి సామాన్య జ్ఞానమందు లయమవును యీ వివేచనమువల్ల జ్ఞానమందు ద్వైతముల్పెన్నముగాదని సిద్ధమగును అనగా విశేషజ్ఞానరూపమగు మహాకారణ దేహముయొక్క ప్రకాశకుడవగు నీవు శుద్ధస్వరూపాత్మవగుట సిద్ధమయ్యెను యిక యీ మహాకారణ దేహమునకు తురియావస్థాది యెనిమిదితత్వములుండెను వాటినన్నిటిని వచింతును ఏకాగ్రచిత్తుండవై వినుము.

శిష్యు॥ గురువర్యా తురీయావస్థయనగానేమి?

గురు॥ తురీయావస్థయనగా నాలుగవ యవస్థనందురు నీవు దాని ప్రకాశకుడవగు తురీయాతీతుడవై యున్నావు.

శిష్యు॥ తురీయమనగా శుద్ధాత్మయనియందురు మీరు తురీయాతీతుడవని నన్ననుచుంటిరి అటులైన శుద్ధాత్మకంటె వేరుగానున్న నేనెవ్వరు.

గురు॥ తురీయమనునదే శుద్ధాత్మ దానినే నేను తురీయాతీతమనుచుంటిని కారణమిదిగదా జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలను గుర్తించునట్టి ఒక ఆత్మ మూడవస్థలకంటె వేరుగానున్నది మరియు నీ మూడవస్థల యపేక్షవల్ల నాలవదియున్నదని చెప్పవలసివచ్చును అనగా యీ మూడవస్థలు నశించిన యెడల దానిని నాలవదియగు తురీయమని వచించుటకు వీలుండదు అందువల్ల తురీయాతీతమనబడెను యిందుకు వేదాంత గ్రంథములందిట్లు చెప్పబడియున్నది.

తోటకం॥ యదిజాగరితప్రభృతిత్రితయం । పరికల్పితమాత్మని

మూఢధియా । అభిదానమిదంతదపేక్షా చేత్ । పరమాత్మపదస్య తురీయమితి॥

మూఢబుద్ధిగల మనుష్యులు అవస్థాత్రియమే ఆత్మయని భావించుచుండిరి యీ యవస్థాత్రియముయొక్క అపేక్షవల్ల పరమాత్మ పదమునకు నాలవదియగు తురీయావస్థయని పేరుగలిగెను ఇందువల్ల అవస్థాత్రయమును విడచి ఆత్మకు తురీయమను పేరు గలుగజాలదు కాబట్టి తురీయావస్థనే తురీయాతీతమని చెప్పబడినది తురీయము నామరహితమని చెప్పియుండెను కాని తురీయాతీతమనుటచే తురీయముకంటె నైదవదియగు ఆత్మ వేరుగానున్నదని చెప్పుటకు వీలుండదు ఎటులనగా ఒక మనుష్యునకు పుత్రునియొక్క యపేక్షవల్ల పితాయని పేరుగలిగెను కాని యాపుత్రుడు గతించినపిమ్మట పితాయను నామముగూడా యుండదు కాని పురుషుడను నామము మాత్రముండును అటులే ఆత్మ తురీయాతీతమైయుండెను యీతురీయావస్థకు మూర్ధనీస్థానము యీ తురీయవను ఆత్మ అపాదమాళి పర్యంతము అనగా శరీరమంతట వ్యాపించియుండుటవల్ల ఒక మూర్ధనీస్థానమందే యున్నదనుటకు వీలులేదు ఇటులుండికూడా మూర్ధనీస్థానమందుండు ననుటకు కారణమిదిగదా మూర్ధనీస్థానము సర్వస్థానములలో శ్రేష్ఠమైనది కాబట్టి తురీయమున కుత్తమస్థాన మొసంగిన బాగుండునని అట్లు వచించిరి మరియు నామహాకారణ దేహమునకు పరావాణి యొకటికలదు అనగా (శబ్దోచ్చారణయొక్క మొదటియవస్థ) గురుశాస్త్రముల యోగంబున ఆత్మయొక్క యదార్థజ్ఞానము గల్గినపిమ్మట నేను కృతార్థుడను నేను ధన్యుడను నాయొక్క జననమరణ దుఃఖము నివారణమైనదని వచించుచుండు విశేషానందానుభవమును ఆనందావభాసభోగమందురు అది యీ మహాకారణ దేహముదైయున్నది మహాకారణదేహమునకు ఇచ్ఛాశక్తి యొకటిగలదు జ్ఞానముదయించినపిమ్మట నిర్వికల్ప సుఖానుభవము గైకొనెదు ఏదైతే యిచ్ఛగల్గునో దాని నిచ్ఛాశక్తి యందురు యీ దేహమునకు శుద్ధసత్వగుణము గలదు రజోగుణ తమోగుణ సంబంధ మించుకైన లేనిదగు సత్వగుణమునే శుద్ధసత్వమని యందురు యీయవస్థయందు ఓంకారము

యొక్క అర్థమాత్రియుండునని దెలియవలెను నేను ద్రిష్టనను అభిమానమీ దేహమందుండును ఇటుల తుర్యావస్థ మహాకారణదేహమునకు యెనిమిది తత్వములు జెప్పబడినవి యీ తత్వముల విశేషజ్ఞానముయొక్క ప్రికాశకుడవగు నీవు సామాన్య పూర్ణ జ్ఞానస్వరూపుడవు.

స్థూలసూక్ష్మకారణ మహాకారణదేహముల తత్వములు మొత్తము యెనుబదిరెండయ్యెను ఎటులన స్థూలదేహ తత్వములు ముప్పదిమూడు సూక్ష్మదేహ తత్వములు ముప్పదిమూడు కారణదేహ తత్వము లెనిమిది మహాకారణదేహ తత్వము లెనిమిది అంత మొత్తము యెనుబదిరెండు తత్వములయ్యెను ఈ తత్వములన్నిటిని గుర్తించు నీవు స్వయంప్రికాశుడవు ఇందులో నెంతమాత్రిము సందేహము లేదు కావున శిష్యా విచారించి కనుగొని నేను సాధిరహిత శుద్ధ బ్రిహ్మనని దృఢనిశ్చయు డెప్పుడగునో అప్పటికి అపరోక్ష జ్ఞానియని చెప్పబడును మరియు జ్ఞానము రెండువిధములుండును ఎటులన పరోక్ష జ్ఞానము అపరోక్షజ్ఞానమని యందురు ఇందుకు పంచదశియొక్క ప్రిమాణము.

శ్లో॥ అస్తిబ్రిహ్మేతిచేద్వేద । పరోక్షజ్ఞానమేవతత్
అహంబ్రిహ్మేతిచేద్వేద । సాక్షాత్కారస్సఉచ్యతే॥

పరబ్రిహ్మ సత్యస్వరూపుడని భావించి బ్రిహ్మ ఆత్మకంటె వేరని దలంచుటయే పరోక్షజ్ఞానమందురు నేనే బ్రిహ్మమనే అనుభముచే బ్రిహ్మము ఆత్మకంటె వేరు లేదని భేధరహిత భావనచే దెలిసికొనుటయే అపరోక్షజ్ఞానమందురు దీనినే సాక్షాత్కారమనికూడా యందురు.

బెల్లము తీపుగానుండునని యొకరు చెప్పినపుడు మనకు తెలివగుచుండునది పరోక్షము బెల్లమును దిని దాని తీయదనము దెలిసికొనునదే అపరోక్షము ఇటులే శాస్త్రోపదేశమువల్ల పరమాత్ముడు సచ్చిదానందుడని దెలిసికొనుట పరోక్షము సద్గురూపదేశమువల్ల సచ్చిదానంద పరమాత్ముడనే నేనని దెలసికొనుట అపరోక్షమనబడును.

ఇంతకుముందు జెప్పబడిన స్థూలసూక్ష్మకారణ మహాకారణదేహములకంటె ఆత్మ వేరుగానుండి వీని నన్నిటిని ప్రికాశింపజేయు శుద్ధ

సాధారణ చైతన్యమగు ఆత్మయేనా నిజస్వరూపమని దృఢభావనచే దేహాధ్యాస నుత్యజించినవాడు శరీరాంతమువు ముందే మోక్షసుఖ మును గాంచినవాడగుచున్నాడు.

శిష్యు॥ గురువర్యా భేదదృష్టి దుఃఖము గల్గించునది కావున యీ దుఃఖ నివృత్తి వేదాంతములయందు ప్రతిపాదించి చెప్పిన అభేద ఆత్మజ్ఞానమువల్ల యగును మరియు మోక్షముగూడా ఆత్మజ్ఞానమువల్లనే గల్గునని చెప్పగ వింటిని మీరైతె నాల్గు దేహములకంటె ఆత్మ వేరని చెప్పుచుంటిరి దేహముకంటె ఆత్మ వేరు ఆత్మకంటె దేహము వేరు అటులే ఆత్మకంటె భౌతిక ప్రపంచము వేరు ప్రపంచముకంటె ఆత్మ వేరు యీవిధ ముగా జెప్పుచుంటిరి కాబట్టి ఇందులో పరస్పర భేదముత్పన్నమై నాకు ద్వైతము దోచుచుండె గాన దయయుంచి నాయొక్క ద్వైతభావన నశించి అద్వైతమయ్యే లాగున బోధజేయుదురని ప్రార్థన.

గురు॥ ఓ నాబిడ్డడా బ్రహ్మము సత్యమైనది బ్రహ్మముకంటె వేరైన నాల్గుదేహములున్న భూత భౌతిక ప్రంచము సత్యమైనచో నీవనునటులనే వచించిన దానివల్ల ద్వైతము గల్గునుగాని భూతభౌతిక ప్రపంచ మసత్యము బ్రహ్మము సత్యమగుటచే నే వచించుటవల్ల లేశ మైన ద్వైతము గల్గదు యిందులకు ప్రమాణము శ్రీకృష్ణభగవానులు భగద్గీతయందిటుల చెప్పియున్నారు.

శ్లో॥ నాసతోవిద్యతేభావో । నాభావోవిద్యతేసతః
ఉభయోరపిదృష్టోంత । స్త్వనయోస్తత్వదర్శిభిః॥

క॥ లేదునిక సత్తునకును । లేదుమరియుసత్తునకును లేమియుసీ రెం
డాదినితత్వజ్ఞానుల । చేదగనిర్ణయములెస్స చేయంబడియెన్ ॥

నశించెడు దేహమునకు నిత్యములేదు సత్యమైన ఆత్మకు నాశము లేదు పరబ్రహ్మమనే వస్తువ దెలిసినవారిచే యీ రెంటను మన దృశ్య ప్రపంచమంతా అసత్యమనియు అదృశ్యమగు యాత్మ సత్యమైనదని నిశ్చయింపబడెను.

శిష్యు॥ మహారాజా యీ ప్రపంచ మసత్యమైనయెడల కను పడవద్దు దుఃఖము గల్గవద్దు వస్తుస్థితి అట్లు లేకపోవుటచే ప్రపంచము

కనుపట్టుచున్నందున దుఃఖము గల్గుచుండెను కావున యిది అసత్యమనదగునటుల బోధించి నన్ను తరింపజేయ వేడుచుంటిని.

గురు॥ నాయనా నిజమెంతో అంతే కనుపట్టును నిజమువల్ల సుఖదుఃఖములు గల్గునని నియమమేమియులేదు అసత్యము గనుపించును దానివల్ల సుఖము గల్గును ఎటులనగా స్వప్నమసత్యమయిన్ని సుఖదుఃఖములు గలిగించును మరియు భ్రాంతివల్ల త్రాడు సర్పము వత్తుగా దోచును రాతిపైని ఎండ తడలు మృగములకు నీటివత్తుగా గనుపట్టును కాని యిందులో సత్యమేమియులేదు అటులే ప్రపంచ మసత్యమయిన్ని సత్యముగాదోచును ఇదియంతయు కల్పితరూపము ఎటులన ఈశ్వరుడు తన మాయాయోగంబున రచించిన కల్పితరూప భూతభౌతిక ప్రపంచము కనుపించిన కనుపించుగాక దీనిని నీవు నివృత్తి జేయవలసిన ప్రయోజనమేమియులేదు ఎందుకన యీశ్వర నిర్మితమగు ప్రపంచము యెవరిని బంధించదు కాని జీవుడు తనంతట తానే నిర్మించుకొనిన ద్వైతము మాత్రము బంధించును దీనిని ఆత్మజ్ఞానమువల్ల నివృత్తి జేసుకోవలెను.

శిష్యు॥ మహారాజా! ఈశ్వరనిర్మితమగు ప్రపంచము దేహాది రూపములవల్ల స్పష్టముగా నగుపడుచున్నది కాని జీవుడు తనంతట తాను కల్పించుకొన్న ద్వైతబంధన మెట్టిదో దయదలంచి వచింపగోరెద.

గురు॥ శిష్యా! ఈశ్వర నిర్మితమగు స్త్రీపుత్ర ధనాదులయందు మమత్వరూప దృఢాధ్యాసము కనుపించుచుండునది జీవుని కల్పితమే యగును ఆ అధ్యాసము బంధనము మరియు దుఃఖమునకు కారణమే యగును యీ దేహమెప్పుడు నింకొకనికి బంధనము గల్పించదు కాని దానియందుండు మమత అహంకారరూపమగు జీవసృష్టియే యీబంధనకు కారణము యీశ్వర నిర్మితమగు మాంసమయస్త్రీతో నెవరికిన్ని సంబంధము లేకపోయిన యెడల యీపె చనిపోయిన నెవరికే దుఃఖము గలుగదు కాని ఫలాని స్త్రీ నాతల్లి నాచెల్లెలు నాబిడ్డ నాభార్యఅని ఇటుల భిన్న భిన్న మమత్వములు జీవుడు కల్పించుకొన్న వాడగుటవల్ల జీవసంబంధ మమత్వమదంలి స్త్రీ మరణించిన యెడల దుఃఖము గలుగును

ఎటులనగా ఒకరి కుమారుడు దూరదేశము కేగియుండ నింకొక గృహస్థు డసత్యమానసుడై యాదూరదేశమందలి కొమారుడు (బ్రతికియుండ యా గృహస్థునితో నీకొమారుడు చనిపోయినాడని చెప్పెను ఆమాటవిన్నం తనే యాతని కసహ్యదుఃఖము గల్గెను ఒకవేళ దేశాంతరమందాతని కొమారుడు నిజముగా మరణించి నప్పటికిన్ని నీకొమారుడు మరణించి నాడని నెవరు చెప్పకుండిన యెడల యతని కేమాత్రము దుఃఖము గల్గక ఆనందముతో నుండును దీనింబట్టిచూడ యిదియంతయు మనోరచనమని స్పష్టముగా దోచుచుండెను ఇదియే బంధనకు మూలము కావున దీనిని ఆత్మజ్ఞానముచే నివృత్తి చేయవలెను.

శిష్యు॥ గురువర్యా! మనోవ్యాపారము బంధనకు కారణమైన యెడల మనోనిగ్రహమును గూర్చి యోగాభ్యాసము జేసిన నగును ఇందుకు మీరు ఆత్మజ్ఞానమే ముఖ్యమనుచుంటిరి యిదియెట్లో తెలుప గోరెదను.

గురు॥ ఆత్మజ్ఞానము లేక కేవల యోగాభ్యాసము జేసిన మనోద్వైతము నివృత్తియగుట నిజమేకాని అట్టి యోగాభ్యాసము నెంతవరకు జరుగునో నంతవరకే మనస్సైకాగ్రమగును పిదప నెప్పటివలెనే యుండును కాబట్టి పునర్జన్మ రాహిత్యమగును ఆత్మజ్ఞాన మందుకే గలుగదు ఆత్మజ్ఞానము లేక నెంతటివారికైనను జననమరణ దుఃఖము నివృత్తి గాదని శ్రుతులయందు జెప్పబడియున్నది.

శిష్యు॥ ఈశ్వర నిర్మితమగు యీ దృశ్య ప్రపంచ ద్వైతము నివారణ గానిదే అద్వైత ఆత్మజ్ఞానము గలుగదుగదా అట్లుండ యీ మానస వృత్తి ద్వైతమెట్లు దొలగును.

గురు॥ శిష్యా అనదూప్రమగు బాహ్య ద్వైతము నివారణమైన మీదట సద్గురూపదేశముచే గల్గుచుండు చిత్తశాంతివల్ల ప్రపంచము మిధ్యయను ఆత్మజ్ఞానము గల్గును అటుపైన మనోద్వైతము లేక మనోవృత్తి భంగమగును ఇందుకు విద్యారణ్యముని జీవకృత ద్వైతము రెండు విధములుగా నుండునని చెప్పియున్నాడు ఎటులన

ఒకటి శాస్త్రీయ ద్వైతము రెండవది అశాస్త్రీయ ద్వైతము

ఇందులో ప్రత్యక్పరిపూర్ణైక్యముయొక్క విచారతన్మయము వేదాంత శాస్త్ర శ్రవణమననాదులు సలుపుట శాస్త్రీయ మనోమయ ద్వైత మనియెదరు సచ్చిదానంద బ్రహ్మరూప ప్రత్యగాత్మయొక్క అపరోక్ష బోధ యెంతవరకు గాకుండునో అంతవరకు శాస్త్రీయద్వైతమందురు కామాదికములు పూర్ణముగ నివృత్తియై అద్వైత తత్వము దృఢబోధ మైనతర్వాత యీ శాస్త్రీయద్వైతము తొలగిపోవును సదా సద్విచార కుశల బుద్ధిమతుడైన పురుషుడు వేదాంత శాస్త్రాభ్యాసముచే పరోక్ష అపరోక్ష జ్ఞానము గల్గినతర్వాత వడ్లలోనుండి బియ్యమును గ్రహించు నటుల శాస్త్రార్థములను గ్రహించి శాస్త్రద్వైతమును విడుచును అట్టి అద్వైత జ్ఞానికి యేవిధమైన బంధనములుండవు.

శిష్యు॥ గురువర్యా! శాస్త్రీయ విచారాదులుగూడా కల్పితమే యనుచుంటిరి కాబట్టి దానివల్ల సంసార బంధము యెటుల నివృత్తి యగునో వచింప వేడువాడను.

గురు॥ సంసారము నిజముగా నుండిన యెడల నివృత్తి జేయనగును యెటుల యాజ్ఞుడో అటుల బలిదానమనునట్లుగా స్వప్నకల్పిత సింహము యొక్క దర్శనంబున కల్పిత స్వప్నమెటుల నివృత్తియగునో అటులే కల్పితశాస్త్రములవల్ల కల్పిత సంసారము నివృత్తి కాగలదు యిక శాస్త్రీయ ద్వైతము రెండువిధములుగా నున్నది ఎటులన ఒకటి తీవ్ర మనియు రెండవది మందమనియు యీ రెంటిలో కామక్రోధాదులను తీవ్రద్వైతమందురు మనోరాజ్యమును మందద్వైతమందురు యీ రెంటిని అద్వైత తత్వబోధ ముందే త్యజింపవలయును ఎందుకనగా తత్వబోధ వడయుటకై సాధన చతుష్టయ సంపత్తి సాధించవలెను అట్టి సాధన సంపత్తిని సాధించుచుండగా కామక్రోధాదులున్ను మనోరాజ్యమున్ను తమంతట తామే తొలగిపోవును సాధనసంపత్తియొక్క వివరము యీ గ్రంథాదియందే చెప్పబడియున్నది యీ ఆత్మజ్ఞానముయొక్క సాధన చతుష్కములలో మూడవ సాధనమగు షట్ సంపత్తిలోని మొదటిదగు శమమను దాని యోగంబున కామక్రోధాదుల త్యజింపవలెను అట్లు జేసిన వాసనలెల్ల తొలగిపోవును సమాధానమను యారవ సంపత్తివల్ల

మనోరాజ్యము నుత్యజించినయెడల చిత్తముయొక్క చలనము తొలగి పోయి ఏకాగ్రతగానుండును కాబట్టి ప్రథమ సాధనావస్థయందే కామ క్రోధాదుల త్యజించి జీవుడు బోధను సంపాదించవలయును.

శిష్యు॥ బోధ సిద్ధించుకొరకు ముందుగ కామాది అశాస్త్రీయ ద్వైతము త్యజింపవలెనని తాము జెప్పియుంటిరి సరేకాని తత్వబోధమైన తర్వాత దానిని గ్రహణము జేయవచ్చునాయని శంకగల్గుచున్నది యిందుకు సమాధానము వచింపగోరెదను.

గురు॥ బోధ సిద్ధించినతర్వాత జీవన్ముక్తత సిద్ధించుకొరకు కామ క్రోధాదుల వర్జింపవలయునేకాని గ్రహింపగూడదు కామక్రోధాదులవల్ల గలిగే క్లేశములచే బద్ధత్వ జీవిముక్తి గాజాలదు అందులకై వర్జింప వలెను. శిష్యు॥ మహారాజా! జననమరణరూపమగు సంసారమువల్లనే నత్యంత మలినములోనైంటిని యిటువంటి దుఃఖములేని సుఖరూప విదేహముక్తి నాకు లభించినపిమ్మట నేను కృతార్థుడనయ్యెదనని దలంచు చుంటినిగాని ప్రపంచములో నేను బ్రతికియుండు నన్నిరోజులే యుండు నట్టి జీవన్ముక్తితో నాకవసరములేదు.

గురు॥ శిష్యా! కామక్రోధాదుల జయించి జీవన్ముక్తుడైనవాడు యిహలోక సుఖప్రాప్తి గలిగించు జీవన్ముక్తిని త్యాగము జేసినయెడల విదేహముక్తి గల్గిన స్వర్గాది సుఖప్రాప్తి గల్గునను భయముచే విదేహ ముక్తినిగూడా వదలవలసివచ్చును అటులైన స్వర్గము మాత్రము ప్రాప్తించుట నిజముకాని జననమరణ దుఃఖరహితమగు విదేహముక్తి నీకెన్న టికి ప్రాప్తించదు.

శిష్యు! మహారాజా! స్వర్గభోగములు నాశవంతములు ఇహ భోగములు దుఃఖ కరములగుటవల్ల యీస్వర్గాది భోగములు నిస్సంశ యముగా త్యజించుటకు సిద్ధమైయున్నాడను.

గురు॥ స్వర్గసుఖము నాశవంతమగుటంజేసి నీవాభోగముల త్యజింపనుంటివి కాని స్వభావికముగనే అనేక దోషములతో నిండినవియు ధర్మాది సమస్త పురుషార్థంబుల నాశ మొసరించునవియు అత్యంత దుఃఖకరములైన నీకామక్రోధాదుల నేల విడువకున్నావు.

శిష్యు॥ వైరాగ్యాది సాధనములచే విలక్షణ అనర్థ కామ క్రోధాదులు నన్ను బాధింపజాలవు నేనువాటిని జయించియుంటిని గాని యిహాలోక మందలి భోగముల నిమిత్తమై తత్పూర్తి కామాదికముల గ్రహించిన యెడల దోషమేమి గలదో వచింప గలందులకు ప్రార్థన.

గురు॥ శిష్యా! ఆత్మతత్వమును దెలిసిన పిమ్మట కామక్రోధాదుల సమూలముగా త్యజింపక వాటివశమై నేను తత్వవేత్తను విధినిషేధ శాస్త్రోపదేశములు నాకొరకులేవు అని యిటు లభిమానముచే ధర్మ శాస్త్రములున్ను (వర్ణాశ్రమధర్మమును విడచి స్వేచ్ఛా వర్తనుడవై) యుంటివా నీకిది యోగ్యమగును ఇందునుగూర్చి మహాత్ము లిట్లు వచింపు చుండిరి.

ఒకానొక పురుషుడు అద్వైత పరమాత్మ తత్వము దెలిసి యధేచ్ఛగా చరించుచు అభక్షణపదార్థముల భక్షింపుచు అనర్థకములందు ప్రవృత్తుడై యుండినయెడల కుక్కయు తత్వజ్ఞాని యీ యిరువురొక తీరుగా నైనట్టులుండును మరియు నెవరికి తత్వజ్ఞానము గలిగినదో యా మనుష్యుడు యధేచ్ఛగా చరింపజాలడు ఎటులనగా తత్వజ్ఞానము మనుష్యునకు పూర్వజన్మ పుణ్యమువల్ల గల్గును అనేకజన్మములయందు జేసిన యజ్ఞయాగాది కర్మలవల్ల సమస్త పాపములు దొలగిపోయి యేమనుష్యుని యంతఃకరణము శుద్ధమై యుండునో యతనికే తత్వజ్ఞానము గలిగి మోక్షము లభించునని భగవద్గీతయందు శ్రీకృష్ణ భగవానులు చెప్పి యున్నారు కావున అనేక పుణ్యకర్మలచే తత్వవిచారము గల్గిన మనుష్యునకు అనేక పాపములచే గలుగు యధేచ్ఛాచరణము గలుగజాలదు మృష్టాన్నము భుజించుమనుష్యుడు యెంతక్షుధగలవాడైనను విషాన్నము భుజింపజాలడు అట్టే పరమాత్మ తత్వముదెలిసిన పురుషుడు యిష్టాను సారముగా నెన్నటికిని సర్తింపడు కావున పుణ్యబలముచే ప్రాప్తించిన తత్వజ్ఞానము వల్ల సదా సద్విచారపరుడై వైరాగ్యయోగమందు జేరి స్వధర్మము ననుసరించి సత్కర్మలు జేయుచుండిన ఆత్మజ్ఞానము గల్గును అట్టి ఆత్మజ్ఞానమువల్ల తృప్తుడైన మనుష్యుడు సనకసనందనాది

మహాత్ములు బొందినట్టి పదవిని గోరునేగాని తుచ్ఛమైన కామాది సుఖములగోరదు యిందుకు భగవద్గీతలో శ్రీకృష్ణభగవాను లిటులనుడివిరి.

శ్లో॥ త్రివిధంనరకస్యేదం। ద్వారంనాశనమాత్మనః
కామక్రోధస్తథాలోభ। స్తస్మాదేతత్త్రయంత్యజేత్॥

కామము క్రోధము లోభము ఈమూడు గుణంబులు నరకప్రాప్తికి హేతువులుగాను తనకు నాశకరమైనవిగానుండును కావున యీ మూడుగుణంబుల త్యజింపవలెను.

క్రామక్రోధాది గుణంబులు నివృత్తి గాకయుండిన జీవన్ముక్తి సుఖముగలుగదు కావున కామాది గుణంబుల నివృత్తిగావించి కల్పిత దేహాది ప్రపంచముకంటె వేరుగానున్న ఆత్మను సద్గురూపదేశము వల్ల దెలసికొనినయెడల నెంతమాత్ర మాలస్యములేక మోక్షము లభించును.

ఇటుల కల్పిత దేహాది సర్వప్రపంచముకంటె భిన్నముగనుండు అద్వితీయ ఆత్మ విషయమైన జ్ఞానముచే మోక్షరూపాత్మ సుఖమును గూర్చి గురుడు బోధించుచు ఆత్మ సర్వవ్యాపియనుటవల్ల అస్తి భాతి ప్రియ అను యీ మూడువిధంబుల నామరూపాత్మ బ్రహ్మాండంబంతట వ్యాపించియున్నదని తెలియవలెను ఎటులనగా నగలు వేరువేరైనప్పటి కిన్ని బంగార మొకవిధముగనే ప్రకాశించుచుండెను అటులే కల్పిత స్థూలసూక్ష్మకారణ దేహములయందున్ను జాగ్రత్ స్వప్న సుషుప్తియను అవస్థలయందున్ను అన్నమయాది పంచకోశములయందున్ను ఆత్మ యొకేవిధముగా ప్రకాశించుచు నంతట వ్యాపించి దేని నంటక వేరుగానేయున్నది నీవు వివేకదృష్టితో చూచినయెడల స్వజాతీయ విజాతీయ భేదరహితమగు అద్వితీయాత్మ యొక్క ఉనికి నీకనుభవమగును.

ఇటుల గురువర్యుండు వచించిన వాక్యములన్నియు శిష్యుడు మొదటనుండి నింతవరకు వినినదంతయు మననముజేసి నిధి ధ్యాసపూర్వకముగా నస్వరూపముయొక్క సాక్షాత్కారముగాంచి తనయొక్క యనుభవమును గురునకు నివేదింపుచున్నాడు.

శిష్యు॥ గురువర్యా! భవదీయ కరుణాకటాక్షమునసే ననుభవించినది

తమ సన్నిధానమునకు నివేదించుచుంటిని పరీక్షింప వేడువాడను.

ఓ కృపానిధే యీ స్థూలసూక్ష్మ కారణములను దేహత్రియము నేనుగాను అటులే జ్ఞాన రూపమగు మహాకారణ దేహముకూడ నేనుగాను జాగ్రత్స్వప్నసుషుప్తులను అవస్థాత్రియము నాయాత్మవికావు యివి యీబుద్ధి వేయగును నన్ను యే వికారమంటదు నేను నిర్వికారుడను తురీయము సాక్షిత్వము యీ రెంటిని యాత్మకు పోల్చెదరు కాని యివి నా స్వరూపమందు పాధియపేక్షచే ప్రాప్తమైనవే కాని నిజముగా నేను పాదరహితుడను నా శుద్ధస్వరూప మందు సాక్ష్యసాక్ష్యము లెట్లు నిల్వగలవు మరియు జాగ్రదభిమాని విశ్వుడు స్వప్నాభిమాని తైజసుడు సుషుప్త్యభిమాని ప్రాజ్ఞుడు యీ మూడున్ను నేనుగాను అటులే తురీయము ద్రష్టసాక్షి యివిగూడా వాస్తవికముగా నాయందుండజాలవు దృశ్యమెంతవరకో నంతవరకే ద్రష్టసాక్షులుండెదరు దృశ్యమే లేనిమొదల ద్రష్ట యెటులుండజాలును ద్రష్ట సాక్షి యీ మొదలగుపేర్లు దృశ్య సంబంధముచే గలిగినవి నేను సంబంధ రహితుడనగు స్వప్రకాశుడను అవాఙ్మానస గోచరుడను.

గురు॥ శిష్యా! నీవనునట్లుగా అవాఙ్మానసగోచర అభేధల స్వార్థ రూపమగు ఆత్మను (జీవేశ్వర భేధరహితమగు ఆత్మను) అనుభవముగా తెలుసుకొని అట్టిఅద్వైత సుఖస్వరూపమే నీవని మనోనిశ్చయము చేసుకొని యుండవలెయును.

శిష్యు॥ మహారాజా! జీవుడు శివుడు యీ యిద్దరొకటేయని తాము నుడువుచుంటిరి కాని ఇందులో నాబుద్ధికి మాత్రము భేధము దోచుచున్నది ఎటులనగా జీవుడు సుఖదుఃఖములకు కర్తగా భోక్తగా నుండి జనన మరణములను జెందుచుండెను ఈశ్వరుడన్నచో సుఖదుఃఖ రహితుడు సమర్థుడు స్వతంత్రుడు జగదుత్పత్తిస్థితి లయములకు కర్తయై యున్నాడు కాబట్టి యీయిరువు రొకటే నెట్లగుదురు యిందునుగూర్చి నాకుసమాధాన మయ్యేలాగున వచింప గలందులకు ప్రార్థన.

గురు॥ శిష్యా! తత్పదము ఈశ్వరుడు త్వంపదము జీవుడు యీ రెండుపదములయొక్క (తత్వం) వాచ్యార్థ లక్ష్యార్థములు నీవు తెలియు

నందున శంకగల్గుచుండెను ఎటులనగా నిదో చూకుము కర్తృత్వ భోక్తృత్వ సుఖదుఃఖాది ద్వంద్వము అవిద్యాకల్పితమైన అంతఃకరణాదులయొక్క ఉపాధిధ్యాసమువల్ల గల్గుచుండెనుగాని జీవునికి ద్వంద్వములులేవు ఇవి అంతఃకరణ ధర్మములు జీవునియొక్క నిజ లక్ష్యార్థరూపము శుద్ధ సచ్చిదానందమనదగును ఇటులే ప్రపంచముయొక్క సృష్టి స్థితి లయ కర్తృత్వములు మాయోపాధిచే జరుగుచుండెనుగాని ఈశ్వరరూపము నిజముగా శుద్ధమగు అద్వితీయ పరిపూర్ణ సచ్చిదానందమైయుండెను ఉపాధిద్వయందలి భేదమువల్ల విచారించక పోవుటచే వాచ్యార్థమునుండి భేదముత్పన్నమగుచుండెనేకాని శివజీవులయొక్క లక్ష్యార్థమును గ్రహించినయెడల నెంతమాత్రము భేదము గానుపింపదు ఇందుకు సామవేదమందలి ఛాందోగ్యోపనిషత్తునందివిషయమును స్పష్టముగా తత్ త్వంఅసి యను మూడు పదములు భేదరహితమునుగూర్చి చెప్పియున్నది యీ మహావాక్యమందు విశ్వాసముంచదగినది మరియు ఆకాశ మొకటేయైయుండ మఠోపాధివల్ల మఠాకాశమనియు ఘటోపాధివల్ల ఘటాకాశమనియు చెప్పుదురు కాని ఘటమఠ ఉపాధులకంటె మహాకాశము వేరుగానున్నది ఏకమేవా ద్వితీయమను న్యాయంబున అద్వితీయమగు తత్వమునుండి మాయోపాధిచే తత్పదము ఈశ్వరుడనియు అవిద్యోపాధి త్వంపదము జీవుడనియు పండితులు వచించుదురు యీరెంటియొక్క ఉపాధిని విడచి లక్ష్యార్థమును గ్రహించినంత జీవేశ్వరు లొక్కటేయను అద్వితీయ స్వస్వరూపము సిద్ధమగును యిందులో నెంతమాత్రము భేదములేదు ఎటులన మఠములో ననేకులుందురు ఘటమందొకరైన నుండరు కాని యీరెంటియందుండు ఆకాశము మాత్ర మొకటేయై యుండెను అటులే యీశ్వరుడు పాధివల్ల మఠమువతుగాను జీవుడు పాధిచే ఘటము వతుగాను భావించవలసినది మఠమందనేకు లుండునట్లుగా యీశ్వరునియం దనేకములున్నవి ఘటమం దెవరుండజాలనట్లుగా జీవునియం దేదియుండజాలదు కాని మఠఘటములందు ఆకాశము మాత్ర మొకటేయుండునటుల శివజీవుల కెంతమాత్రము భేదములేదు భేదములేదని తత్వమసి బోధించుచున్నది యిక వేరుగా జెప్ప నక్కరలేదు

కావున జీవేశ్వరులయొక్క వాచ్యార్థరూపముగా నున్న యుపాధిద్వయ మును త్యజించి హే ముముక్షో నీవా జీవేశ్వరుల శుద్ధ లక్ష్యస్వయం ప్రకాశరూపుడనని దృఢపరచుకొనుము.

శిష్య! గురువర్యా తత్పదమగు యీశ్వరునియందు త్వంపద మగు జీవునియందు వాచ్యరూపమగును పాధి నెద్దియుండెనో మరియు లక్ష్యరూపము దేని ననియెదరో దయయుంచి కొద్దిలో దెలుపగోరు చున్నాడను.

గురు! శిష్యా తత్పదము యీశ్వర వాచ్యోపాధి మాయయని యం నెదరు యిది ప్రపంచ వ్యవహారాభిమాని త్వంపదము జీవుడు ఉపాధి అవిద్య యిది దేహేంద్రియ వ్యవహారాభిమాని యిటుల మాయా యవిద్యయను వాచ్యార్థరూపముతో నున్న నివి దృశ్యములు వీటిని త్యజించి నీవీ తత్ప దత్వంపదములందలి లక్ష్యార్థరూపముతోనున్న స్వయం ఆత్మవైయున్నావు యిందుకు భగవద్గీత పదమూడవ అధ్యాయ మందు శ్రీకృష్ణభగవానులు "క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి" ఓ అర్జునా సర్వ క్షేత్రములందలి (దేహములందలి) ప్రాణము యింద్రియములు మనస్సు బుద్ధి మొదలగువాటిని దెలిసికొను క్షేత్రజ్ఞుడు (జీవుడు) నాస్వరూపుడనే తెలిసికొనుము మరియు భాగవతమందు ఈశ్వరుడు జీవుడు నాస్వరూపుడే యని యీ క్రింద వ్రాయబడు శ్లోకమందు జెప్పియున్నాడు.

శ్లో॥ అహంభవాన్నచాన్యస్త్వం । త్వమేవాహంవిచక్ష్వభో
నవాపశ్యంతికవయ । శ్చిత్రంజాతుమనాగపి॥

తా॥ హే జీవా నేనే నీవైయున్నావు నాకంటె నీవు వేరుగాలేవు నీవు నేను ఒక్కటేమైయున్నామని విచారము చేసి చూడుము ఎవరైతె జ్ఞానసంపన్నులగు సత్పురుషులుగలరో వారెల్లప్పుడు మన నిర్వురలో నెంతమాత్రము బేధము దలంపరు జీవేశ్వరు లొక్కరూపమనియే భావిం తురు యిటులే శృతి స్మృతి పురాణములు మొదలగు వేదాంత గ్రంథ ములయందు జీవేశ్వరు లొక్కటేయని చెప్పబడియున్నది కావున ఒరే నా శిష్యా నీవు కూడా నీయొక్క ఆత్మను బ్రహ్మస్వరూపముగానే దలంచుము.

శిష్యు॥ గురువరా జననమరణ క్షుత్పిపాసా శోకమోహములను నీ షడూర్ములు బ్రహ్మకు లేవని శాస్త్రములందు వచించినటుల విని యుంటినికాని నాయందు పై జెప్పిన షడూర్ములున్నట్లుగా దోచుచుం డెను కావున నేను బ్రహ్మస్వరూపుడ నెటులౌదును.

గురు॥ బ్రహ్మమునకు షడూర్ములు లేవని శాస్త్రములందు వ్రాసి యున్నది నిజమే యా బ్రహ్మరూపము నీయొక్క ప్రత్యగాత్మయగుటచే యా ప్రత్యగాత్మ తన మనఃప్రాణములకంటె వేరుగానున్నదని నీవెరుం గక దేహాది ధర్మములను ఆత్మయం దారోపించి నాకు జననమరణాను లుండెనని నీవు దలంచుచుంటివికాని నిజము విచారించిన యవి నీ యాత్మ యందులేవు ఎటులనగా జననమరణములు రెండును స్థూలదేహమువై యున్నవి క్షుత్పిపాసలు రెండు ప్రాణమువై యున్నవి శోకమోహములు రెండును మనస్సువై యున్నవి కాబట్టి వీటి కన్నిటికి ద్రష్టయగు నీ యాత్మయం దీషడూర్ములులేవు ఊర్మి విరహిత బ్రహ్మమే ఆత్మ స్వరూ పము అట్టి ఆత్మస్వరూపమే సర్వాంతర్యామి అట్టి సర్వాంతర్యామియగు ఆత్మయే నీవు కావున నీవు జీవన్ముక్తుడవై యున్నావు యిందులో నెంత మాత్రము సంశయములేదు.

శిష్యు॥ స్వామీ కర్మ లెన్నివిధములున్నవి కర్మలకు భోక్త యెవరు కర్మలయొక్క నివృత్తి యెట్లగును జీవన్ముక్తుడని యెవరి నన వలెనో దెలుపగలందులకు ప్రార్థన.

గురు॥ కర్మ మూడువిధములుగానున్నది (1) సంచితము (2) క్రియ మాణము (3) ప్రారబ్ధము అనేక జన్మములందుజేసిన పాపపుణ్యాది కర్మల భోగించుటకై సంస్కారరూపంబున అజ్ఞానముతోగూడి సూక్ష్మ శరీరమందుండునది సంచితమనియందురు ఈ జన్మమందు దేహమువల్ల నిత్యనైమిత్తిక కర్మలు జరుగుచుండునది క్రియమాణమందురు పూర్వ జన్మ కర్మఫలం బనుభవించుట కొరకే జన్మంబెత్తనయ్యెను మరియు నీ జన్మంబున సుఖదుఃఖాది భోగములేవైతే గల్గుచుండునో వాటి నన్నిటిని ప్రారబ్ధమందురు యిందులో ఆత్మయొక్క అపరోక్ష జ్ఞానాగ్నివల్ల సంచిత కర్మ దగ్ధమగును మరియు కమలదళంబులకు నీరెటులంటకుండునో

అటులే అపరోక్షజ్ఞానమునకు క్రియమాణకర్మలంటవు ఎందుకనగా కాయికవాచక మానసిక కర్మ లేవైతె జరుగుచుండునో అందులో నేను కర్తనను యభిమానము గలుగజాలదు అందులకై క్రియామాణ కర్మగూడ జ్ఞానాగ్నివల్ల నశించును యిటుల జ్ఞానపురుషులయొక్క సమస్తకర్మలు క్షీణించును యిందుకు భగవద్గీతయందు శ్రీకృష్ణభగవాను లిట్లు చెప్పి యున్నారు:

శ్లో॥ యథైధాంసిసమిద్ధోగ్ని । ర్భస్మసాత్కురుతేర్జున
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి । భస్మసాత్కురుతేతథా॥

తా॥ ఓ అర్జునా లెస్సగా ప్రకాశించుచున్న అగ్నిదేవుడు కట్టెల నేప్రకారంబుగా భస్మము జేయుచున్నాడో అటులే జ్ఞానమనెడు అగ్ని సమస్తకర్మంబులను భస్మము జేయుచున్నది.

ఈప్రకారము పరమాత్మజ్ఞానము గల్గినంతనే సంచిత క్రియమాణ కర్మలు నివృత్తియగును కాని ప్రారబ్ధకర్మ మాత్రము యథావిధిగా తలపై నిలచియుండును ప్రారబ్ధమువల్ల శరీరమెంతకాలముండునో యంతకాలము ప్రారబ్ధకర్మ ఫలరూపమగు సుఖదుఃఖములు స్థూలదేహ ద్వారా సూక్ష్మదేహమునుండి అంతఃకరణము భోగించుచుండును భోగరూప దేహమునకు నేనుద్రష్టనని బ్రహ్మరూపుడనని యేమనుష్యుడు తెలుసుకొనుచున్నాడో యతనిని జీవన్ముక్తుడని యనందగును మరియు త్రివిధ కర్మలనుండి సంచిత క్రియమాణములు జ్ఞానాగ్నిచే నశించును గాని ప్రారబ్ధము మాత్రము నశింపదు యీ ప్రారబ్ధ కర్మ భోగించుటచేతనే నాశమొందునని యిటుల శాస్త్రవచనములున్నవి మరియు నీదేహము ప్రారబ్ధమువల్లనే గలిగినదని యీదేహము ప్రారబ్ధ భోగ యాతనమని యింద్రియములు భోగసాధనములని అంతఃకరణము ప్రారబ్ధ భోక్తయని చెప్పబడినది కావున ప్రారబ్ధ మనుభవించియే తీరవలయును అది సంచిత క్రియమాణములవలె జ్ఞానముచే చిక్కువడునదికాదు ఎటులనగా ఒక విలుకాడు చెట్టునందలి యొక యాకును గురిజూచి తన బాణమును ప్రయోగించెను నావిలుకాని సంకేతనము చొప్పున ఆకును దూరుకొని బాణము వెళ్ళిపోయెను అతడు ప్రయోగిం

చిన భాణము అదివరకే యాగవలయుననుతలంపుతో ప్రయోగించెను కాని యాభాణ వేగమెంతవరకుండెనో యంతవరకు బోయి నిలచి క్రిందబడెను భాణకాని సంకేతినవాడు చొప్పున నిలుపకపోయెను అది నిల పుటకు యా విలుకాని కేయుపాయము చేకూడా సాధ్యము గాకపోయెను దాని వేగమెంతవరకుండెనో అంతవరకే నిలచునను మాట సిద్ధమేగదా అటులే ప్రారబ్ధము శరీర ముండునంతకాల ముండును దానిని పట్టబోతె చేతినుండివెళ్ళిన భాణము వతుగా చిక్కవడదు.

వేయిమాటలతో పనియేమి ప్రారబ్ధమే దేహముగన దేహముండు నంతవరకు ప్రారబ్ధముండును ప్రారబ్ధమును త్యజించెదనన్నచో దేహమునే త్యజించవలెను మనుష్యుడు దేహములేక మోక్షమును సంపాదింపజాలడు యాజ్ఞవల్క ఉద్ధవ వసిష్ఠ పరాశర వేదవ్యాస శుకశౌనకాది అద్వైత జ్ఞాన నిష్ఠాపరులు దేహమువల్ల జ్ఞానమును సంపాదించి పరబ్రహ్మ స్వరూపులైరి మరియు అతులప్రతాపవంతుడగు జనకరాజు భగీరథుడు శిబిరధ్వజుడు మొదలుగాగల రాజులు దేహధారులేగదా పైన వివరించిన వారెల్లరు ప్రారబ్ధ మనుభవించక జ్ఞానులై మోక్షము జెందిరని శృతులయందు జెప్పియుండెనా లేదు యెంతటివారలైన ప్రారబ్ధ మనుభవించియే తీరవలెను గాని యీశ్వరజ్ఞానముగల మనుష్యుడు ప్రారబ్ధము వల్ల ప్రాప్తించెడు సుఖదుఃఖములు దేహముకేగాని నాకు గాదు నేనే దేహమును ప్రకాశింపజేయునట్టి ఆత్మను అభోక్తనగు పరబ్రహ్మమును కాని నేనీ దేహమునుగానని భావించి ప్రారబ్ధ పూర్వకముగా గలుగు సుఖదుఃఖములకు చలింపకుండును మరియు నీదేహము నాదని వచించుటచే జ్ఞానికనృతదోషము తప్పకగల్గును శృతులుగూడా నిటులే చెప్పుచున్నది "నాన్ృతాత్పాతకంపరమ్" అసత్యభాషణముకన్న గొప్పదియగు పాపమెద్దియులేదు కాబట్టి దేహము నాదియని చెప్పువాడు మహాపాపియని చెప్పబడును కారణమేమన నీదేహము పంచమహాభూతములదని యింతవరకే చెప్పబడియున్నది అటు లీదేహము పంచమహాభూతములదై వికారము దృశ్యము జడము అనిత్యము పరిచ్ఛిన్నమని దెలసి తాను ఆత్మ అవికారి ద్రష్ట నిత్య పరిపూర్ణజ్ఞానరూపమనియు దేహము అపవిత్రి

దుర్గంధ మలమూత్ర రుధిరాదికములచే నిండినదని యీ విధముగా దేహముకంటె నాత్మ ఆత్మకంటె దేహము భిన్నముగానున్నదని తెలసి తినది గాని దేహమును నాదనిచెప్పుట యసత్యమని వేరుగా వచింప నక్కరయేలేదు మరియు నీదేహమునుగూర్చి శ్రీకృష్ణభగవాను లుద్ధవునితో నిట్లు వచించియున్నాడుగదా. ఓ యుద్ధవా దేహము నాదియని వచించు మనుష్యుని మృత్యు నోటిలో వేయుదలంచిన సన్నిపాత రోగ వశునిగా భావింపవలయును ఎటులనగా సత్వరజస్తమోగుణములతో నిండియుండు దేహము నాదియని వచించునపుడు వాతపిత్త కఫములను మూడురోగము లొక్కచోట గలసి (త్రిదోషము) సన్నిపాతము మనుష్యుని మృత్యుదేవత నోటిలో వేయునట్లు శరీరము నాది యను మనుష్యునికి జననమరణ దుఃఖము నివృత్తికాజాలదు కాబట్టి యే మనుష్యునకు బ్రహ్మ నిష్ఠాపరుండైన సద్గురునియొక్క అనుగ్రహము వల్ల నేను సచ్చిదానందుడ ననేబుద్ధి గలుగునో వాని పుణ్యము మహా గొప్పదియని తెలియవలెను బ్రహ్మవిచారము విలక్షణ పుణ్యహేతువని తెలియదగినది.

మరియు బ్రహ్మవిచార మొక క్షణకాలమైన స్థిరబుద్ధితో నెవడు చేయుచున్నాడో వానికి గంగాది సమస్తతీర్థములయందు స్నానమొన రించినంత పుణ్యఫలమేగాక సమస్త పృథ్వీదానము సహస్రయజ్ఞములు జేసిన ఫలముకంటె నెక్కుడు పుణ్యఫలము లభించును మరియు తమ పెద్దలంద రుత్తమలోకంబుకుం జేరుదురని సిద్ధాంత ముక్తమాలయను గ్రంథములో జెప్పబడియున్నది కావున యిటుల బ్రహ్మవిచారము నొక క్షణకాలమొనర్చిన వానికే నింతటి పుణ్యము గల్గుచుండ నిక దేహా ధ్యాసనువదలి నేను బ్రహ్మస్వరూపాత్మనని యిటుల మనుష్యుని బుద్ధి బ్రహ్మాకారమైనయెడల వాని పుణ్య మింతటిదని చెప్పుట కెంతటివారి కైన నలవికాదు మరియు "దేహాత్మబుద్ధిజంపాపం" అనగా దేహామే నేనని దలంచుటవల్ల లక్ష గోవులను వధించు పాపముకంటె హెచ్చు పాపమనియు ఆత్మహత్య జేసినవార మ్యెదరనియు శృతులయందు జెప్ప బడియున్నది కావున, దేహాధ్యాసను త్యజించి సర్వకాల సర్వావస్థల

యందు నేను సచ్చిదానందస్వరూపుడనను బుద్ధిచే పుణ్యమార్గమందు జేరి అట్టి పుణ్యబలంబున శుద్ధజ్ఞానరూపుడవయ్యి "స్వయంప్రకాశ చైతన్య స్వయమేవ" యను భావనచే అనగా సర్వప్రాణులయందుండి ప్రకాశించు ఆత్మారాముండొకడేయనియు యా ఆత్మారాముడ నేనని తెలసికొని ఆనందించదగినదిగాని దేవుడు వేరు నేను వేరని దలంచు మనుష్యుడు పశుతుల్యుడు ఎటులైతె పశువులు బండీ నాగలి మొదలగు బరువుల మోయ నుపయుక్తమో అటువలె నట్టి మనుష్యుడు దేవతా కార్యముల కుపయోగపడు పశువని శృతులయందు జెప్పబడియున్నది మరియు అద్వైత బ్రహ్మమందు భేదభావనగల మనుష్యుడు మృత్యువు నోటిలో బడును కావున ఓ శిష్యా నీవు బేధముడిగి నేనే బ్రహ్మమునని నిస్సందేహుడవయ్యి బ్రహ్మస్వరూపము నొందుము.

ఒకానొక యధికారము గల ముముక్షువు దేవవాక్యములు శ్రవణము జేయుచుండ దేవుని దెలసినయెడల సర్వపాప నివృత్తియగునని విని నేనెట్లు దేవుని దెలియగలనో నాకు దేవుని జూపించు వారెవ్వరో యని చింతించి ఒకానొక బ్రహ్మనిష్ఠగల సద్గురునివద్దకుపోయి మహారాజా "కోదేవః" దేవుడెవరనియడుగును అంతె నాసద్గురుడు "యోమనస్సాక్షీ" మనస్సుయొక్క సాక్షి: అనగా (మనస్సును గుర్తించువాడే దేవుడని యర్థము) యిటుల వచింప నాముముక్షువు నామనస్సును గుర్తించు వారెవరు కావచ్చును సత్పురుషులందునా దేవుడందునా లేక యింద్రియములా అని యిటుల తన మదిలో వితర్కించుచు నేదియుందోపక చాలా కాలము విచారసాగరంబున మునిగి తుద కింకొకగురునివద్ద కేగి స్వామీ నామనస్సును గుర్తించు వారెవరని యడిగెను అంత నా సత్పురుషుడు నీమనస్సును నీవే యెరుగుదువని వచించెను ఆమాటలా ముముక్షువు విని యీతడు సరిగా వచించుటలేదని నింకొకచోటికి వెళ్లెను ఆయనకూడా నటులే వచించెను యిటు లనేక దేశములం దిరిగి నదులైన సత్పురుషుల నెల్ల నడిగిన వారెల్లనిటులే బదులుజెప్పిన విని తుదకు యిది నిజముగా వచ్చునని భావించి ఒకచోట గూర్చుండి తన మదిలో విచారము జేయుచుండ కొంతకాలమువరకు మనస్సువల్ల జరుగుచుండు

సంకల్ప వికల్పముల గ్రహించునదే సాక్షి యీ సమస్త జాగ్రత్స్వప్న సుషుప్తులందు జరుగుచుండెడు వ్యవహారమంతయు మనస్సుదేయగును దానిని గుర్తించునదే సాక్షియని యిటుల సిద్ధాంతము జేసుకొని గురు సన్నిధకరిగి మహారాజా నామనస్సు నాకే కన్పట్టుచుండెనని వచించెను అంత యీ సద్గురుండు "దేవస్త్వమేవాసి" అటులైన దేవుడవే నీవు స్వయంప్రకాశ దేవరూపుడవగు సర్వసాక్షివే నీవని చెప్పి "ఏకోదేవః" అనగా ఒక్కడే దేవుడు పిపీలికాది బ్రహ్మపర్యంతము స్వయంప్రకాశమానుడై యున్నాడని వేదాంత శాస్త్రములు మొరపెట్టుచుండ మనుష్యులు అజ్ఞానముచే తెలియజాలక మోసపోవుచుండిరి కావున నీవు సమస్తభేదముల వదలి నీయందుండు ద్వైతమును త్యజించి అభేదాద్వైత నిర్వికల్ప స్వప్రకాశుండవై సవికల్ప సమాధినుండి నిర్వికల్ప సమాధియందు నిరంతరముండుము.

శిష్యు! మహారాజా సవికల్ప సమాధి నిర్వికల్ప సమాధి యనగా నేమి.

గురు! నేనే బ్రహ్మము బ్రహ్మమే నేనని యేకాంతస్థలమందు గూర్చుండి చిత్తమును చలింపనీయక తదేకధ్యానముగా నుండుటే సవికల్ప సమాధియనబడును మరియు బ్రహ్మమే నేనను ధ్యానమును మరచి మనోబుద్ధులు రెండును శూన్యమై సకల తలంపులుడిగి దేహాది సకల ప్రపంచమును మరచి తాను తానై కేవల చిన్మాత్రుడై సాక్షిగా నుండుటే నిర్వికల్ప సమాధియనబడును.

శిష్యు! గురువర్యా! సమాధి నిష్ఠగల మనుష్యుడు ఆత్మజ్ఞానమును గూర్చి వేరేవిచారములందు జేరునా లేక సమాధియందే నిమగ్నుడై యుండునా దయజేసి వచింప గోరువాడను,

గురు! ఆత్మ సాక్షాత్కారమునకు శ్రవణ మనన నిదిధ్యాసలను నీమూడు సాధనము లనబడును చిత్తము శబ్దాది విషయము లందెంతమాత్రముండునో యంతకాలము మనుష్యునకి సాధనము జేయుటకు వీలుపడదు కావున

గీ॥ విషయములనన్నిటినినీవు విషమువలెను । వలదిత్యజియించి నెప్పుడు దప్పకుండ । సాధుసాంగత్యమొనరించి సత్యమైన । బ్రహ్మపద మునుగైకొమ్ము పరమశిష్య॥

ఇటుల విషయములన్నిటిని విషమువలెనుగా త్యజించి శాంతశమద మాది సంపన్నుడవై సద్గురు శరణుజొచ్చి వారివల్ల శ్రవణ మననములు జేయుచు తద్వారా ఆత్మసాక్షాత్కారము సంపాదించుటే మోక్షమన బడును యిందునుగూర్చి సర్వకాలములందు సత్సంగుడవై యుండుము.

శిష్యు॥ స్వామీ సత్సంగమనగానేమి!

గురు॥ జ్ఞానము వైరాగ్యము దయ సంతోషము నిష్కామ్యము అక్రోధము క్షమ సదాచారాది గాగల లక్షణములతో వెలయు వారు సత్పురుషులనబడును శబ్దాది విషయములను విషమువలెనుగా త్యజించి మోక్షాపేక్షగల ముముక్షువు పైదెల్పిన సత్పురుషుల శరణుజొచ్చి వారి సమాగమ మందుండుటే సత్సంగత్వమనబడును యిందుకు ప్రమాణము శ్రీశంకరాచార్యు లిట్లు వచించియున్నారు.

శ్లో॥ సత్సంగత్వేనిస్సంగత్వం । నిస్సంగత్వేనిర్మోహత్వం
నిర్మోహత్వేనిశ్చలతత్వం । నిశ్చలతత్వేజీవన్ముక్తిః॥

తా॥ సత్సంగమువల్ల నిస్సంగుడ వయ్యెదవు అనగా నిన్నంటియున్న దోషములు తొలగును నిస్సంగమువల్ల మోహము నశించును మోహము నశించినతోడనే నిశ్చలమైన తత్వము నీకబ్బును నిశ్చల మానసుడవై నంతనే జీవన్ముక్తుడవైతివని దలంచుము చూచితివా సజ్జన సాంగత్య మెంత గొప్పదియో వారి దర్శనమాత్రంబున క్షమాదయాది సద్గుణములు నిన్ను జెందును అట్లుజెందుటచే నీమనస్సు నిశ్చల మగును నిశ్చలమైన మనస్సుచే వారి బోధను శ్రవణమననాదుల జేయుటవల్ల ఆత్మజ్ఞానముగల్గి మోక్షము లభించును గావున "మహానుభావసంపర్కే సంసారార్ణవలంఘనమ్" అనునటుల మహానుభావుల సమాగమమువల్ల సంసారసాగరముదాటి సచ్చిదానంద పరబ్రహ్మపదమును బొందగలవు గాన సత్పురుషుల వెదకికొని వారి మూలముగా ముముక్షులు తరింతురు గాక ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః

## గద్య

ఇది శ్రీవైశ్యకుల పారావార సుధాకర పునిగళిల గోత్రోద్భవ
చెర్వీరాల వంశ ప్రదీపిక రాజమాంబా గర్భ శుక్తిముక్తా
ఫల మార్కండేయ మత్స్యేంద్రనాథేత్యాది
నానావిధ గ్రంథరచన బాగధేయ సకల
సజ్జన విధేయ బాగయార్య ప్రణీతం
బైన జీవన్ముక్తి బోధామృతమను
వేదాంత గ్రంథరాజము
సర్వము సద్గురు చర
ణారవిందార్పణమస్తు
శ్రీ శ్రీ శ్రీ

---

# అనుభవ మంత్ర చింతామణి



## వశీకరణమంత్రములు



## దేహరక్షణమంత్రములు



అట్టా బైండు వెల రు. 2

ఇందులో యేమంత్రము పనిచేయకపోయినను గ్రంథకర్తగారికి వ్రాసుకొనిన సరియైన సమాధానము తెలుపబడును. గ్రంథకర్త:- చెర్విరాల బాగయ్యగారు, బొంబాయి.